# సూర్యుడెప్పుడూ ఉదయిస్తూనే వుంటాడు

సూర్యుడెప్పుడూ ఉదయిస్తూనే వుంటాడు
ముఖం కడుక్కొని కళ్ళు ముడుచుకుంటూనే వుంటాం
శత్రువూ మిత్రుడూ ఒకేసారి గుర్తు కొస్తారు
భయంకరమైన భావ సంఘర్షణను
    దుఃఖంలోకి దూకి కడిగేసుకుంటాం

అకస్మాత్తుగా అడ్డుగోడల మీదగ పడే
    వాల్ పోస్టర్ మీద మన కళ్ళు అతుక్కుంటాయి

ఇంతలో ఒక కరపత్రం ఎగిరి వచ్చి కడుపు మీద అంటుకొంటుంది
ఒక నినాదం వచ్చి మన రక్తంలోకి దూకుతుంది
అంతలోనే పరుగెత్తి ఊరేగింపులో కలిసిపోతాం
ఎత్తిన పిడికిళ్ళను నడినెత్తిన సూర్యుడందుకొంటాడు
గుండెల్లోకి మంటలు దిగుతాయి
బహిరంగ సభావేదిక మీద సూర్యసేనుడవుతాడు
మధ్యాహ్నం నుండి వేకువదాకా భవిష్యద్దర్శన మవుతుంది
ఆ తరువాత సూర్యుడుదయించటాని కెళతాడు
వెను వెంటనే మనం నాలుగ్గోడలమధ్య
    నిద్రపోడాని కుపక్రమిస్తాం
మనం మేల్కొనే సమయ మేదో అర్థంకాక
సూర్యుడెప్పుడూ ఉదయిస్తూనే వుంటాడు.

జయరాజ్

ప్రజాసాహితి
సాహిత్య సాంస్కృతికోద్యమ మాస పత్రిక

ంపుటి : 15 సంచిక : 12
సెప్టెంబర్ 1992

'చనలు పంపవలసిన చిరునామా :
ిర్మలానంద,
వర్కింగ్ ఎడిటర్,
29-28-67, దాసరివారివీధి,
సూర్యారావు పేట,
విజయవాడ - 520 002.

మేనేజర్, ప్రజాసాహితి,
29-28-67, దాసరివారి వీధి,
సూర్యారావు పేట,
విజయవాడ-520 002.

జంట్లు, చందాదారులు
ాయవలసిన అడ్రస్,
తర వివరాలకు :
త్తపల్లి రవిబాబు, ప్రధానకార్యదర్శి
జనసాహితి, నగరం-522 268.

ిల : రూ. 5 సం॥ చందా రూ. 50




ముఖచిత్రం :
సమస్యల సుడిగుండంలో
భారతం

★

కవరు లోపల రెండవ పేజీలో
సూర్యుడెప్పుడూ ఉదయిస్తూనే
వుంటాడు (కవిత)
—ఛాయరాజ్

★

నాలుగవ కవరు పేజీ :
అమ్మకడుపు చల్లగా... (కవిత)
— చెరుకు సుధాకర్

## ఈ సంచికలో....

| | | |
|---|---|---|
| సంపాదకీయం | | 3 |
| వర్షం పడింది (కథ) | —ఆర్. రామకృష్ణ | 8 |
| చదువుకే బేరం (జనం పాట) | —వెంకన్న | 16 |
| కన్యాశుల్కంలో కుటుంబ వ్యవస్థ | —కాత్యాయనీ విద్మహే | 18 |
| పిడికిలెత్తిన కవితాగానం ట్రేసీ చాప్‌మన్ | అనుసృజన్—ఎ.ఎన్. | |
| ఆ నవ్వుకి అర్థం ఏమిటి ? (సినిమా సమీక్ష) | —దివికుమార్ | |
| అంకురం (కవిత) | —దివికుమార్ | |
| స్వీకారం | | |
| భూస్వామ్య సంస్కృతి రూపాలు; వర్ణాశ్రమ ధర్మాలు, కులం | | |
| గురజాడ గీతం 'దేశభక్తి' | —ఛాయరాజ్ | |
| గురజాడ మానవతావాదం (పుస్తక సమీక్ష) | —కొత్తపల్లి రవిబాబు | 46 |
| పిల్లల ప్రపంచం | | 49 |
| ఉత్తరాలు | | 51 |
| మనల్ని చుట్టుముడుతున్న బూతు (స్పందన) | —డా॥ సుధీర్ | 52 |
| చైతన్యవాహిని | | 53 |

# సంపాదకీయం

## ఒక విజ్ఞప్తి! ఒక పిలుపు!

మేధావులారా! ప్రజాతంత్ర వాదులారా! ప్రజలారా!

ఈనాడు తెలుగునాట వ్యాప్తిలో వున్న సాంస్కృతిక జీవనం ఎంత అధమాధమ స్థితిలో వుందో మీకు ప్రత్యేకంగా తెలియచెప్పనక్కర్లేదు. ఈ పతన సాంస్కృతిక విలువలు మిమ్ములను కలచివేస్తున్న వాస్తవమూ అంగీకరించక తప్పదు. ఐతే ఎవరి పరిధిలో వారు వీటిని విశ్లేషించి, ఈ పతన విలువల వ్యాప్తిని అరికట్టే ప్రయత్నం చేయడం మనందరి కర్తవ్యం.

ప్రస్తుతం వస్తున్న తెలుగు సినిమాలలో అశ్లీల సన్నివేశాలూ, సంఘటనలూ, సంభాషణలూ, పాటలూ విశృంఖలంగా వీరవిహారం చేస్తున్నాయి. ఒకనాటి ద్వందార్థాలు అదృశ్యమై ఏకార్థాలే మిగిలిపోతున్నాయి. కుటుంబ సమేతంగా సినిమాలు చూడలేని పరిస్థితి దాపురించింది. స్త్రీ పురుష సంబంధాలు, ప్రేమ అంటే కేవలం సెక్సు సంబంధమన్న భావజాలాన్ని సినిమాలు ప్రచారం చేస్తున్నాయి. నీలిచిత్రాలు ప్రేక్షకులలో లైంగిక అత్యాచారాలకూ, స్త్రీలపై దాడులకూ లోనుచేస్తున్నాయి. ఈ అశ్లీల చిత్రాల దుష్ప్రభావం సమాజంపైనా, ముఖ్యంగా యువతరం పైనబడి అవి పతన విలువలను వ్యాప్తి చేస్తున్నాయి. స్త్రీలను కేవలం పురుషుడి కామవాంఛలను తీర్చే మాంసపు ముద్దలుగా భావించే దుస్థితి దాపురించింది. నెలల పసికందుల నుండి 90 సంవత్సరాల ముసలి వగ్గుల వరకూ కూడా కామాంధకారంతో కళ్ళు మూసుకుపోయిన కిరాతకుల అత్యాచారాలకు బలిఅవుతున్నారు. ఒక్క మన రాష్ట్రంలోనే ప్రభుత్వ లెక్కల ప్రకారం సరాసరి రోజుకు ఇద్దరు మహిళలు అత్యాచారాలకు గురౌతున్నారు. అందుచేత అశ్లీల చిత్రాల కారణంగా వ్యాప్తి చెందుతున్న చిత్తకార్తె సంస్కృతిని అరికట్టే చర్యలు చేపట్టవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. సెన్సార్ నిబంధనలు ప్రజాదృక్పథాని కనుగుణంగా ఖచ్చితంగా అమలు జరిపించేటట్లు ఉద్యమించాల్సిందిగా కోరుతున్నాం.

అత్యధికమైన సినిమా పాటలు వినలేనంత భయంకరంగా తయారవుతున్నాయి. వైయక్తికమైన రతిక్రీడా సన్నివేశాలు పచ్చిగా పాటల రూపంలో వస్తున్నాయి. ఇవిగాక ప్రైవేటు ఆడియో కేసెట్ల ద్వారా పచ్చి బూతు పాటలు- 'ప్రసిద్ధ' విద్వాంసుల బాణీలతో, 'ప్రసిద్ధ' గాయకులు, గాయనులు గానం చేసినవి- 'ప్రసిద్ధ'

రచయితలు రాసినవి- శ్రోతలలోని అధమ ప్రవృత్తులను రెచ్చగొడుతున్నాయి. సినిమాలలోని బూతుపాటలు మైకులద్వారా, రేడియోద్వారా, టి.వి. ద్వారా బహుళంగా ప్రచారమౌతున్నాయి. 'పక్కింటి మొగుడు - ఎదురింటి పెళ్ళాం'; 'హలో డార్లింగ్ లేచిపోదామా?'; 'ఇద్దరు పెళ్ళాల ముద్దుల పోలీసు'; 'ఏంటి బావా-మరీనూ....'; 'పెళ్ళి నీకు - శోభనం నాకు' లాంటి-సినిమాల పేర్లు ప్రేక్షకులలో నీచ ప్రవృత్తులను పెంచుతున్నాయి. కుటుంబాలలోనూ, సమాజంలోనూ సాధారణ వ్యవహారంలో వాడే పదజాలమంతా బూతు అర్థాలు ధ్వనించేవిగా మార్చివేసేంత పతనావస్థకు ప్రజలను లోనుచేశారు. పొలం దున్నడం, సైకిల్ తొక్కడం, ఎడ్ల బండి తోలడం, కారు నడపడం, వడ్లు దంచడం- ఇలా నిత్య జీవితంలో నిరంతరం సమాజానికి అవసరమయ్యే అనేకానేక దైనందిన చర్యలన్నింటికీ బూతు అర్థాల్ని ధ్వనింప చేస్తున్నారు. ఒక్కమాటలో చెప్పాలంటే మనం బూతు ప్రపంచంలో జీవిస్తున్నట్లూ, బూతే సర్వస్వం అన్నట్లూ భావజాలం వ్యాప్తి చెందింది. ఆడియో, వీడియో కాసెట్లు విజృంభించినంత వేగంగా బూతు భావజాలం కూడా వ్యాప్తి చెందుతోంది. ఇది ప్రజలయొక్క సాంస్కృతిక జీవనంపై ప్రత్యక్ష ప్రభావాన్ని కలిగి, సామాజిక జీవనాన్ని "పశుత్వం" వైపుకి నడిపిస్తోంది.

ఒకప్పుడు కొందరి పడకటింటి తలదిండ్లు, పరుపులు క్రింద రహస్యంగా మూలుగుతుండే బూతుసాహిత్యం ఈనాడు పబ్లిగ్గా, విచ్చలవిడిగా లభిస్తోంది. ఆర్టీసీ బుక్‌స్టాల్స్‌లో, కిళ్ళీ బడ్డీలలో అవి ప్రత్యక్షమౌతున్నాయి. సినిమా వార పత్రికలు, సినిమా తారల నగ్న, అర్ధనగ్న పడకటింటి పోజులతో దర్శనమిస్తున్నాయి. ఇక సాధారణ పాఠకుల సాహిత్యాభిరుచిని సంతృప్తిపరచవలసిన వార పత్రికలు అశ్లీల 'వార' పత్రికలుగా రూపొందాయి. ఇవి అక్షరాస్యులైన అత్యధిక సాధారణ కుటుంబాలను సపరివారంగా ప్రభావితం చేస్తున్నాయి. నిబంధనలు ఆచరణలో అమలు జరగకపోయినా, సినిమాల విషయంలో 'A' సర్టిఫికెట్ (పెద్దలకు మాత్రమే) అనేది వుంది. మరి బూతు పాటలకూ, మాటలకూ, బూతు సాహిత్యానికీ అడ్డూ, అదుపూ ఏది ?

బాల బాలికల హాస్టళ్ళలో ఈ రకపు చౌకబారు అశ్లీల సాహిత్యాలకు విపరీతమైన గిరాకీ పెరిగి, ఎదిగీ ఎదగని చిన్నారి హృదయాలను కలుషితం చేస్తున్నాయి. ప్రత్యక్షంగా సాంఘిక జీవితంపైనా, కుటుంబాలపైనా ఇవి ప్రసరించి, సంఘ సంస్కృతినీ, సభ్యతనూ, నడకనూ, నడతనూ ప్రభావితం చేస్తున్నాయి. ఈ అశ్లీలపు కంపు నుండి ప్రజలనూ, పాఠకులనూ మనం కాపాడుకోవద్దా!

గతంలో బ్రాకెట్, మట్కా జూదాలు రాష్ట్రంలో విచ్చలవిడిగా సాగాయి. తెలుగుదేశం ప్రభుత్వం ప్రజలయొక్క జూద మనస్తత్వాన్ని ప్రభుత్వ ఖజానాకి చేరేట్టుగా మట్కాని నిషేధించి, 'భాగ్యలక్ష్మి' లాటరీలను పునరుద్ధరించింది. ఆ

లాటరీ నుంచి ఉద్భవించింది రోజువారీ లాటరీ- సింగిల్ నంబర్ లాటరీ. ఇది మట్కాకి మరొక వికృత రూపమే. ఇది గ్రామాలకు కూడా విస్తరించి ఒక్కో చోట ఒక్కో రూపంలో సాగుతూ, ప్రతిరోజూ కొన్ని కోట్ల రూపాయల లాభాన్ని దీని నిర్వాహకులకు తెచ్చిపెడ్తోంది. ఫలితంగా లక్షలాది జూదరులు తమ విలువైన పైకాన్ని పోగొట్టుకుంటున్నారు. దీనివల్ల అతి కొద్దిమంది లక్షాధికారులుగా రూపొందడమే కాక, తేలికగా డబ్బు సంపాదించుకోవాలనే మనస్తత్వం ప్రజలలో వ్యాపించింది. పరోక్షంగా ఈ ఆశ అనేక నేరాలకు దోహద పడుతోంది. అంతిమంగా 'శ్రమైక జీవన సౌందర్య' భావననూ, ఆదర్శాన్నీ భగ్నంచేసి జాతిని నిర్వీర్యం చేస్తుంది. అంతర్జాతీయ స్థాయిలో మనలను నవ్వులపాలు చేస్తుంది. ఈ అన్నిరకాల అనుమతి పొందిన, అనుమతి పొందని లాటరీల నిషేధాన్ని మనం డిమాండ్ చేయాలి.

వందలాది పట్టణాలలో, వేలాది గ్రామాలలో ఈనాడు మంచినీటి కరువు వుండగా, సారాయికి మాత్రం కరువు లేకుండా 'విరాజిల్లు' తున్నాయి. ప్రభుత్వమే ప్రత్యక్షంగా, చట్టబద్ధంగా సారా వ్యాపారం చేసి, ప్రజల శ్రమశక్తిని సంవత్సరానికి సుమారు 200 కోట్ల రూపాయలు ప్రత్యక్షంగానూ, అనేక వేలకోట్ల రూపాయలు పరోక్షంగానూ కొల్లగొడుతోంది. అవినీతిని వ్యాప్తి చేసిన కొందరు రాజకీయ నాయకులు ప్రజలు అవినీతిపరులుగా దిగజారిపోయారని నిందించినట్లు... తాగుడికి శ్రామికులు బానిసై పోయేంతగా అలవాటు చేసి, కప్పుసారా తాగకుండా ప్రజలు ఉంటారనంటే, ప్రభుత్వ 'సారా'ను బంద్ చేస్తామని ప్రకటించడం హాస్యాస్పదం.

సారా, బ్రాందీ తదితర మత్తు పదార్థాల వాడకం వల్ల ప్రజల శారీరక ఆరోగ్యమూ, మానసిక స్థితీ చెడ్డగా ప్రభావితమై- అది వారికీ, సంఘానికీ చెరుపు చేస్తున్నదా లేదా అన్నదే ప్రశ్న. 'చెడునే కలుగచేస్తోంది' అని అంగీకరించే పక్షంలో దాన్ని నివారించడానికి అంచెలంచెలుగా 'సంక్షేమ' ప్రభుత్వమనీ, 'సోషలిస్టు' ప్రభుత్వమనీ, 'ప్రజాస్వామ్య' ప్రభుత్వమనీ గొప్పలు చెప్పుకునే ప్రభుత్వం ఏ చర్యలు చేపట్టబోతోంది? తాగుడు దురలవాటును అరికట్టాలని కోరుకునే వారికి ప్రభుత్వం తోడ్పాటును ఎందుకు ఇవ్వలేకపోతోంది ?

కుటుంబ జీవనాన్ని కలుషితం చేస్తూ, ఎన్నో నేరాలకు ప్రేరణనిస్తూ, మహిళలపై అత్యాచారాలకు పరోక్షంగా సహాయపడుతూ శాంతి భద్రతల సమస్యకు కారణభూతమైన సారాయిని అంచెలంచెలుగా 'బంద్' చేయమని మనందరం డిమాండ్ చేద్దాం. కనీసం తాగుడుకు వ్యతిరేకంగా ప్రజలు వివిధ రూపాలలో ఆందోళనకు సిద్ధపడుతున్న ప్రదేశాల నుండైనా ప్రభుత్వ సారా దుకాణాలను ఉపసంహరించుకునే విధంగా కృషి చేద్దాం.

మిత్రులారా!

మీకు బాగా తెలుసు. సంస్కృతి అంటే కేవలం ఆట, పాట, సంగీతం, సాహిత్యం మాత్రమే కావు. ప్రజలయొక్క జీవన విధానం సంస్కృతి. సమస్త మానవ సంబంధాల సారం సంస్కృతి. ప్రజల హృదయాలలో కదిలి, భావాలలో మెదిలి, దైనందిన చర్యలలో ప్రదర్శితమయ్యే జీవితాచరణే సంస్కృతి. మనం నాగరికత యొక్క ఏ పొరల మీద జీవిస్తున్నామో తెలియపర్చే కొలబద్ద సంస్కృతి.

మా లాగానే మీకు కూడా ఈనాటి సాంస్కృతిక వాతావరణం సంతృప్తి కరంగా వుండదని తెలుసు. ఇది మారటం అవసరమని మీకు బాగా తెలుసు. అందుకు వ్యక్తులుగా మనందరి కృషి ఆవశ్యకతను మీకు మేము ప్రత్యేకంగా గుర్తు చేయనవసరం లేదు.

నేటి సంస్కృతిని నిర్ణయిస్తున్న వివిధ మౌలికాంశాలను మేము ప్రస్తావించడంలేదు. కారణం అవి వ్యవస్థతో పీటముడి వేసుకున్నవి గనుకనే. అయితే మనందరం కలిసి ప్రస్తుత ఆర్థిక, సామాజిక, రాజకీయ వ్యవస్థల పరిమితుల్లోనైనా కొన్ని సంస్కరణలు, మార్పులు, ప్రస్తుత పరిస్థితిని మెరుగుపరచే చర్యలు చేపట్టవచ్చు.

పైన మేము పేర్కొన్న అంశాలు ప్రజలయొక్క జీవితాలతో ప్రత్యక్షంగా చెలగాటమాడుతున్నాయి. అవి అనేక సామాజిక ఉద్రిక్తతలకూ, శాంతిభద్రతలకూ కారణభూత మౌతున్నాయి. కనుక మన రాష్ట్ర ప్రభుత్వపు పరిధుల్లో ఉన్న మేరకైనా వాటిని అదుపు చేయమని డిమాండ్ చేద్దాం. మన డిమాండ్‌ను పాటించే విజ్ఞత పాలకుల కుందనే భావిద్దాం. ఆపాటి విచక్షణా, సంస్కారమూ పాలకులకు లేని పక్షంలో, ఎన్నుకోబడని ప్రజా ప్రతినిధులుగా, ప్రజా రచయితలుగా, ప్రజా కళాకారులుగా, సాధారణ ప్రజలుగా పతన సాంస్కృతిక విలువలకూ, వాటిని అదుపు చేయలేని పరిపాలకులకూ వ్యతిరేకంగా ఉద్యమిద్దాం. విప్లవ సాహిత్య, సాంస్కృతిక శక్తులు ఈ ఉద్యమంలో ముందువరసలో వుండి కృషి చేయడానికి సంసిద్ధంగా వున్నాయి - మీరందరూ ఈ ప్రజా ఉద్యమంలో పాల్గొని, ప్రజల సంక్షేమం కొరకు కృషి చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం! ఈ ఉద్యమ నిర్మాణంలో భాగస్వాములు కావాల్సిందిగా పిలుపు నిస్తున్నాం!!

# వర్షం ఎడింది

—ఆర్. రామకృష్ణ

తూర్పున బారెడు పొద్దెక్కింది. ఎండ తీక్షణంగా కాస్తోంది. కిష్టయ్య ఒక చేత్తో కేరేజి పట్టుకొని, మరోచేత్తో మునకాల కర్రతో పశువుల వెంట నడుస్తున్నాడు. ఊరిచివరకు రానిచ్చి, సెంటర్లో పశువుల్ని నిలబెట్టేడు. తనతో రోజూ పశువుల్ని తెచ్చే ఏసేబు, తిర్నాద, సిర్నోడు, నరసింహ-వాళ్ళెవరూ ఇంకా రాలేదు. కాబట్టి కాసేపు పశువుల్ని మందగా నిలబెట్టి, వాళ్ళ కోసం ఎదురు చూస్తున్నాడు.

కాస్సేపట్లో సిమ్మడు తన పశువుల్ని తోలుకొని వచ్చి, కలిసాడు కిష్టయ్యతో.

"ఒరే సిమ్మా! ఆడేడిరా? రాంగాడు రాలేదేం!" అని అడిగాడు.

"ఆలమ్మ యింకా గెంజి కట్టలా. అందుకే నాను ముందొచ్చి సేను" అన్నాడు జవాబుగా సిమ్మడు.

"యియ్యాల యింత పొద్దెక్కినా గుంటలెవ్వరూ రాలేదేంటి చెప్మా" అని కల్లాలవైపు చూస్తున్నాడు కిష్టయ్య. ఎవరూ పశువులు తెస్తున్నజాడ కనబడ లేదు. ఎదురుగా పంతులుగారు మాత్రం బరువైన సంచితో కాస్త వంగినడుస్తూ వస్తున్నారు తమవేపే. కాస్త దగ్గరగా వచ్చేక "ఒరే కిష్టయ్యా! మన ఆవును విప్పుకు వెళిపొచ్చేసేవట్రా"ని అడిగారు పంతులుగారు. కాని ఆ మాట వినబడక కిష్టయ్య "ఏటండి పంతులుగోరూ! యిట్నించొత్తన్నారు?" అని పలకరించేడు. దానికి పంతులుగారు "కల్లాల వీధిలో మన దిబ్బ రామినాయుడుగారు లేరా.. .వాళ్ళింట్లో శాంతి జరిపించేసి ....వాళ్ళ పెద్దమ్మాయికి పిల్లాడుగదా"... అన్నారు బరువుగా ఉన్న సంచిని ఒక్క క్షణం క్రిందికి దించి నిలుచున్నారు చెయ్యిమార్చుకోవడానికి వీలుగా పంతులు గారు.

"యింతకీ మన ఆవును విప్పుకు వచ్చావా లేదా !?" అడిగారు మళ్ళీ.

కిష్టయ్య తన ఆవులతోపాటుగా మరో నాలుగు ఆవుల్ని నెల జీతానికి మేపుకుని తోలుతూ ఉంటాడు. అందులో పంతులు గారి ఆవు ఒకటి. అందుకే అడిగేరు. దానికి కిష్టయ్య "ఆదేంటి బాబు!....తమరి ఆవును ఒగ్గేత్తానా ...అల్లదిగోండి .... అల్లా నక్కావు పక్కన నిలబడ్డాది" అని వేలు ఎత్తి చూపించాడు. "అయినా యిప్పమాత్రం నాఖమేటండీ బాబు. మెయ్యడానికి ఎక్కడేనైనా ఉంది గనకనా! కట్టు దగ్గర నేకుండా అలా తిప్పుకు రావడం తప్పించి...."అన్నాడు కిష్టయ్య.

"అయినా కొత్తగావట్రా....ప్రక్క వూరి పొలాలవైపు తోలుకున్నారటగదా. కాసిన్ని నీళ్ళున్నా తాగొస్తాయి. మన

వూర్లో ఉంటే అవి గూడ కరువే కదా" అన్నారు పంతులుగారు.

"అయితే బుగతగోరు! నాకు తెలీక అడుగుతాను? మరి మనూరికి వర్షాలు పడవంటారా?" సందేహం వెలిబుచ్చుతూ కొంచెం బాధగా అడిగాడు కిష్టయ్య.

"ఎందుకు పడవురా!....ఎల్లప్పుడూ యిలాగే ఉంటుందా....కాకపోతే కాస్త ఎటామటిగా పడతాయి. ఈ సంవత్సరం భూమి మీద పది పాళ్ళ వర్షముందని పంచాంగంలో వ్రాసి ఉంది. అదీగాక గత నెలరోజులుగా మన ప్రెసిడెంటు గారు రామమందిరంలో పురాణ కాలక్షేపము గూడ చేయిస్తున్నారు గదా! అదీ రేపు కళ్యాణ మహోత్సవంతో అయిపో వస్తుంది కూడాను. కాబట్టి చూడాలి-యివాళో రేపో తప్పకుండా పడుతుంది వర్షం" అని చెప్పి వెళ్ళిపోయారు పంతులుగారు.

కిష్టయ్య ఆలోచనల్లో పడ్డాడు.

"తాతా పదరా. అంధమూవచ్చేసారు" అన్న సిమ్మడి మాటతో ఆలోచనలోంచి తేరుకొని స్పృహలోకి వచ్చిన కిష్టయ్య, పశువుల మంద ఎక్కువై కుమ్ములాడు కోవడం చూసాడు. దాంతో కర్రపైకెత్తి 'ఒహో....హో....'అని అదిలించాడు.

పశువులన్నీ దారి సాగుతున్నాయి ముందుకి. గోధూళి ఎర్రగా ఆకాశాన్ని కప్పేస్తున్నట్టుగా లేస్తోంది పైకి. పిల్లలందరూ పశువుల వెంటపడి, వాటిని తగులుతున్నారు. కిష్టయ్య మాత్రం ధూళికి దూరంగా అందరికంటె వెనుకను నడుస్తున్నాడు. అతడి తల నిండా ఆలోచన్లు ముసురుతున్నాయి.

'రేపు నిజంగా వర్షం పడుతుందా! పడుతుందనే నమ్మకంతోనే ఉన్నారు ఊరు ఊరంతా. తనకి మాత్రం ఎందుకో నమ్మకం కలగడంలేదు. నెలరోజులయి పురాణం చెప్తూనే ఉన్నారుకదా శాస్త్రుల్లుగోరు. ఏనాడైనా ఒక్క మబ్బుకాసిన పాపానపోలేదు ఆకాశం. ఒక్కసారిగా రేపు వర్షం కురుత్తుందంటే ఎలా నమ్మడం!?'....అతని ఆలోచన్లలా సాగుతూనే ఉన్నాయి. అవి ఎంతకీ తెగకుండా ఉన్నాయి.

కిష్టయ్యకు వర్షం లేదన్నబాధ చాలా ఉంది. అయితే పురాణం చదవడంవల్ల వర్షం పడుతుందంటే నమ్మలేకుండా ఉన్నాడు వాడు.

"ఆ రోజు శంభులింగం పంతులు గారు చెప్పినట్టు ఈ వూరి పెజలమీద బగమంతుడికి కోపం వచ్చే ఉంటాది. లేపోతే మూడేళ్ళగా ఈ వూరికి వర్షం లేకపోవడం ఏటి? పక్కఊళ్ళలో పడడమేంటి?" కిష్టయ్యఆలోచనలు ఒక్కసారి నెల్నాళ్ళు వెనక్కి వెళ్ళిపోయాయి ...

ఆ రోజు ఊరి ప్రెసిడెంటుగారు పెద్దలందర్నీ కూడేసి, నీళ్ళలేక ప్రజలు పడే యిబ్బందులు గురించి చర్చించడం, దానికి తలొక విధంగా సలహాయివ్వడం-అన్నీ చూసాడు తను. ఆ రోజు అక్కడికొచ్చిన బ్రాహ్మణ వీధిపెద్ద శంభులింగం గారు,"అయ్యా! తమరంతా వింటానంటే నాదో మనవి" అని అన్నారు. దానికి అందరూ ఆయనవైపు చూసారు- 'అదే

మిటో చెప్పండి' అన్నట్టు. అప్పుడు పంతులుగారు "మరేంలేదు. మన ఊర్లో మనుషులూ పశువులూ నీళ్ళు లేక ఎలా యిబ్బంది పడుతున్నదీ మనమంతా చూస్తునే ఉన్నాం. అదీకాక ఏ నుయ్యో గొయ్యో తవ్వించినా, బోరింగులు కొట్టించినా, ఏమీ లాభం లేకపోవడం ఎరుగుదుము. అందుచేత నా మనవి ఏమిటంటే మనూర్లో ఏదోరకంగా వర్షాలు పడేటట్టు చేయాలి. అలా జరిగితే త్రాగడానికేకాదు తొలకరి పంటలు కూడ వేసుకోవచ్చు గదా. దానిని గురించి కొంచెం ఆలోచించండి" అన్నారు.

అక్కడున్న పెద్దలకిగానీ, చుట్టూ జేరిన జనానికిగానీ ఈ మాటలు అర్థం కాలేదు. 'వర్షం పడాలని అందరికీ ఉంది. కానీ అది పడొద్దూ-ఏమిటో ఈయన వెర్రిగాని' అన్నట్టుగా తలోరకంగా గుసగుస లాడారు.

అప్పుడు ప్రెసిడెంటుగారు జనాన్ని కాస్త కసిరి "మీఆలోచనేమిటో పూర్తిగా చెప్పండి, పంతులుగారు!"అని అడిగారు.

"గత మూడేళ్ళుగా మన వూరికి వర్షాలు లేవు. ప్రక్కవూళ్ళల్లో అడపా దడపా కురుస్తూనే ఉన్నాయి వర్షాలు. కాబట్టి నేను గ్రహించినదేమంటే ఈ ఊరి మీద భగవంతునికి ఆగ్రహం కలిగినట్టుగా ఉంది. దాన్ని ఏదో ఒక సత్కార్యంచేసి, భగవంతుని అనుగ్రహం పొందితే, మనకు మంచి జరుగుతుందని నా అభిప్రాయం. 'అయితే ఏమి చేద్దామంటారు?' అని అడుగుతారు మీరు. ఈ రోజు యింతమందిమీ కలిసి రాముల వారి సన్నిధిలో మన కష్టసుఖాలు వెళ్ళబోసుకుంటున్నాము. కాబట్టి ఆయన మన గోడు వినకపోడు. అలాగే ప్రతిరోజూ పదిమంది యిక్కడ చేరి సత్కాలక్షేపం చేసినట్లయితే, మన కోరిక తప్పక నెరవేరుతుంది" అని ముగించారు పంతులుగారు.

ఈ మాటలకు కొందరు పెద్దలు సంతోషించారు. 'ఊరికే ఉండేకన్నా ఉడతా సాయమైనా మేలే'అన్నట్టు ఏదో ఒకటి చేస్తే బాగుంటుంది అన్నారు పెద్దలు. దాంతో 'అలాగే చేద్దాం' అంటే 'అలాగే చేద్దాం' అనుకున్నారు. ప్రెసిడెంటుగారు పంతులుగారికే ఆ భారం ఒప్పజెప్పి, సింహాచలం నుండి ఓ వేద పండితుడ్ని తీసుకురమ్మనమని పురమాయించారు.

ఆ మరునాడే పంతులుగారు సింహాచలం వెళ్ళడం, ఓ పండితుడ్ని తీసుకు రావడం, ఆయన రోజూ పురాణం చెప్పడం జరుగుతూనే వుంది....

నడుస్తూ నడుస్తూ చిన్న రాయిని తన్నుకొని 'అబ్బా....' అనుకుంటూ ఈ లోకంలోకి వచ్చిపడ్డాడు కిష్టయ్య. చూస్తే పశువులు చాలా దూరం వెళ్ళిపోయాయి. దాంతో గబగబా అడుగులు వేసాడు.

మిట్టమధ్యాహ్నం వేళ. సూర్యుడు నడినెత్తిమీద కొచ్చేడు. పశువులన్నీ చెట్ల నీడల్లోకి చేరిపోయాయి. సొమ్ముల వాళ్ళంతా కేరేజీలు విప్పుకోడానికి లేచేరు.

చెట్ల క్రింద చేరి అందరూ క్యేరేజీలు

విప్పుతున్నారు. "నువ్వేటి తెచ్చావురా" అంటే...., "నువ్వేటి తెఛ్చావురా" అని ఒకరినొకరు అడుగుతున్నారు. కొందరు "గంజిబువ్వ"అంటే కొందరు"అంబలి" అని చెప్పారు. కొందరు కూరలు తెస్తే, కొంతమంది ఉల్లిపాయ, మిరపకాయ నంజుకి తెచ్చేరు.

తిండి ముగించేక, కేరేజిలు కడుక్కొన్నారు. కిష్టయ్య తన ఒంటికప్పు కేరేజి కడిగేసి, ఎండలో బోర్లించి వచ్చి నీడలో కూర్చున్నాడు. ఏసేబు, తిర్నాద చెట్టెక్కి చెరో కొమ్మమీదకూర్చున్నారు. కొందరు నేలమీదే చతికిలబడ్డారు. ఎండ కాస్త తగ్గితే తప్ప పశువులు చెట్లక్రింది నుంచి బయటికిరావు. అంతదాకా వాళ్ళకు విశ్రాంతే. పిచ్చాపాటీ మాట్లాడుకోవడం, కథలూ కబుర్లూ చెప్పుకోవడం వాళ్ళకి పరిపాటి.

"తాతా ....తాతా.... రేపు సిన్నోడు పశువుల్నిప్పడట" చెప్పాడు తిర్నాద.

"ఏమో?" అడిగాడు కిష్టయ్య ముఖావంగా.

"రేపు రామ్మంజిరం మీద పూజంట కదా! అందుకే ఆలయ్య ఉండిపొమ్మన్నాడట" కారణం చెప్పాడు తిర్నాద.

"రామ్మంజిరం మీద పూజయితే నీ కే ల బా బూ" అన్నాడు ఏసేబు గోముగా, అక్కడే ఉన్న సిన్నోడు వైపు చూస్తూ.

"ఉత్తినే....సూత్తాను...." అన్నాడు సిన్నోడు సంతోషంగా.

"అవునురా....రేపోపాలికి అందరం మానేసి సూద్దుమాపూజ ఎలాగసేత్తారో" అడిగాడు నరసింహ ఆసక్తిగా.

"అలాగే.... అందరం మానేద్దాం" అంటూ వంతపాడేడు రామిగాడు.

"మీరంతా మానేస్తే మానేయండి. నేను మాత్రం మాన్ను. మా బగత తంతాడు" అన్నాడు ఏసేబు దీనంగా తన పాలేరు బ్రతుకును గుర్తు చేసుకొంటూ.

ఈ మాటలన్నీ వింటున్న కిష్టయ్యకు ఓ మెరుపులాంటి ఆలోచన వచ్చింది. అందరివైపూ చూసి చిన్న చిరునవ్వు నవ్వి, "ఎవులుమూ మానేయెద్దు. అలాటి పూజ మనమూ సేద్దుము" అన్నాడు కిష్టయ్య.

"మనమేటి సేత్తాము తాతా?" అడిగాడు సిమ్మడు.

మన మందరమూ కలసి సొమ్మల పండుగ జేద్దుము" అన్నాడు కిష్టయ్య.

"ఎలాగసేత్తారు తాతా ఆ పండుగ?" ఈసారి అడిగింది రామిగాడు.

అందరూ కిష్టయ్యవైపే చూస్తున్నారు కుతూహలంగా.

"మరేటి నేదర్రా! మన సొమ్మలోల మందరమూ బగమంతున్ని పార్దించాలన్నమాట. 'తండ్రీ! ఓ....బగమంతుడా! మమ్మల్ని సూడకపోయినా, మా పశువుల్ని సూడవా! నోరులేని జీవాలు నీలు నిప్పుల్లేక మాడిపోతున్నాయి. ఆటినైనా కనికరించవా" అని ఏడుకుంతామన్న మాట" అని వివరంగా చెప్పాడు కిష్టయ్య వాళ్ళందరికీ.

"అలాగయితే వర్షం పడుద్దా?" అందరూ ఒక్కసారి అడిగారు.

"ఓ .. తప్పకుండా పడుద్ది. నేనెన్ని సార్లు సోదా సూడనేదు. మా సిన్నప్పటి నుండి ఈ పండుగ ఎన్నోసార్లు చేసే వోళ్ళము. అన్నిసార్లూ అలాగే పడింది వోన" తన అనుభవాన్ని విప్పి చెప్పాడు కిష్టయ్య.

"అయితే ఎప్పుడు సేద్దాము?" అడిగారు అంతా మళ్ళీ.

"రేపే....ఏకాదశికదా...." చెప్పాడు కిష్టయ్య.

"మరి....ఊర్లోనూ రేపేకదా పూజ" అనుమానంగా అడిగాడు సిన్నోడు, రెండూ ఒక్కసారి జరిగిపోవడం బాగు లేదన్నట్టుగా.

"ఉంటే ఉన్నియ్! ఆల దారి ఆలదీ-మన దారి మనదీ" అన్నాడు ఏసేబు. అందరూ అలాగేనని తలలూపేరు.

కిష్టయ్యకు ఈ ఆలోచన వచ్చిన కాణ్నించీ చాలా హుషారుగా ఉన్నాడు. చిన్ననాడు పశువులు మేపేటప్పుడు వరసగా ఏ ఐదారుసార్లో యిలాగే సొమ్మల పండుగ జేసేడు, అప్పటి తన తోటి సొమ్మలోళ్ళతో. అయితే తరువాత పశువుల్ని మేపే పని తప్పిపోయింది. మళ్ళీ కొంత వయసు దాటనిచ్చి ఒకటి రెండేళ్ళయి పశువుల్ని మేపుకు తోలడం వలన, ఆలనాడు చేసిన ఈ పండగ గురించి ఇంతవరకు తన జ్ఞప్తికి రాలేదు. ఇప్పుడు జ్ఞాపకాని కొచ్చిన దగ్గరనుంచి చాలా ఆనందంగా వుంది అతనికి.

సాయంత్రం పశువుల్ని ఇళ్ళకు తోలుతున్నప్పుడు అందరికీ చెప్పాడు. "రేపు చీకటుండగానే అందరూ పశువులు యిప్పుకు రావాలి. ఈ రోజులాగయితే కుదర్దు సుమీ. సట్టా సామాను సంగతి నేను చూసుకుంటాను గానీ, మీరు పెందలాడే బయలెల్లాలి" అని.

'అందరూ సరే'నని తలలూపారు.

సాయంత్రం పశువుల్ని కట్టేసి రామమందిరం మీద కాసేపు కూర్చున్నాడు కిష్టయ్య. మందిరం నిండా జనం హడావుడిగా తిరుగుతున్నారు. 'రేపు జరగబోయే కళ్యాణ మహోత్సవానికి అంతా సన్నద్ధం చేసే పనిలో ఉన్నారు అందరూ. పెద్దలు వస్తున్నారు, వెళ్తున్నారు. పనులు ఒకటి కొకటి వాటంతటవే జరిగిపోతున్నాయి. ఊరి జనమంతా ఉత్సాహంగా పనుల్లో చొరబడ్డారు. కొందరు కుర్రాళ్ళు మందిరం చుట్టూ మామిడి తోరణాలు కడుతున్నారు. కొందరేమో మందిరానికి ముందు రాటలు పాతి పందిళ్ళు వేస్తున్నారు. ఆడవాళ్ళు నలుగురైదుగురు కల్లాపి చల్లి, పందిరి కింద ముగ్గులు పెడుతున్నారు.

కిష్టయ్యకు ఇదంతా చూస్తుంటే రేపటి కళ్యాణము ఘనంగానే జరిపించేటట్టు అర్థమయింది. ప్రెసిడెంటుగారు 'రేపు ఊరి జనమంతా ఎటూ పోరా'దని దండోరా కూడా వేయించారు. ఊరు ఊరంతా మహా సందడిగా ఉంది. 'రేపు ఆ కార్యక్రమము కాస్తా జరిగిపోతే చాలు.వర్షం పడిపోతుం' దన్న విశ్వాసంతో ఉన్నారు వూరి జనం. కిష్టయ్యకు మాత్రం ఈ రకమైన పూజలు, కళ్యాణాల వల్ల వర్షాలు పడవని, ప్రజల

మీద కోపం దేవుడికి ఒకంత పోదని గట్టి నమ్మకం.

కిష్టయ్యకు జనం గొడవ అసహ నంగా ఉంది. దానికి తోడు పంచాయితి ఆఫీసు నుండి రేడియో గోల కూడ తోడవడంతో, లేచి యింటికి వెళ్ళి పోయాడు.

ం ం ం

తెల్లగా తెల్లవారేసరికి కిష్టయ్య,మిగతా సొమ్మల జట్టూ - అందరూ కలిసి మధ్య దారిలో వున్నారు. పశువుల మంద ముందున నడుస్తోంది. కిష్టయ్య తెల్లగా ఉతికిన బట్టలు కట్టుకొని, భుజాన గోనె సంచి మూట పట్టుకొని వెనకగా నడు స్తున్నాడు.

పశువులన్నీ ఎప్పటిలాగే ప్రక్క వూరి దొరగారి తోటలోకి వెళ్ళాయి. కిష్టయ్య మూట క్రిందికి దించాడు. అప్ప టికి ఆకాశంలో పొద్దు బారెడు దూరం పోయింది.

"ఆ పంతులుగారి తెల్లావును ఉపాస ముంచాలి. దాన్ని చెట్టుకు కట్టేయండి" అన్నాడు కిష్టయ్య.

తర్వాత సంచిలోంచి సామా నులు తీసి, ఎవరెవరు ఏయే పనులు చెయ్యాలో చెప్తున్నాడు. పిల్లలందరూ సంతోషంతో చకచకా ఆయా పనులు చేసుకు పోతున్నారు.

తిర్నాద తపేలా తీసుకుని, చెరువుకి నీలకెళ్ళాడు. సిమ్మడు చెట్టెక్కి మామిడి ఆకులు తెంపుతున్నాడు. నరసింహా, ఏసేబు నేల మీద చిన్న గొయ్యి తవ్వు తున్నారు, పొయ్యిలాగా. సిన్నోడూ, కిష్టయ్యా తోటలో ఎండు పుల్లలు ఏరు తున్నారు.

కిష్టయ్య యింటి దగ్గర తలంటు స్నానం చేసి, ఉపవాసంతో వచ్చాడు. తిర్నాద తెచ్చిన తపేలాతో నీళ్ళు పొయ్యి మీద పెట్టి, పొయ్యి ముట్టించాడు. బియ్యం కడిగి ఎసట్లో పోసాడు. సంచి లోంచి బెల్లం, పాలు తీసి తగుమాత్రం వేశాడు.

సిమ్మడు ఆకులు ఏరి నాలుగేసి, అయి దేసి కలిపి విస్తర్లుగా కుట్టాడు. నరి సింహా, రామిగాడూ పశువుల్ని చూడ్డానికి వెళ్ళారు.

చెట్టుకు కట్టేసి ఉన్న ఆవు అసహ నంగా అటూ యిటూ తిరుగుతోంది. కట్టు తెంపేసుకోవాలని పెనుగులాడుతోంది.

కిష్టయ్య పరమాన్నం వండి క్రిందకు దించాడు. సిన్నోడూ, సిమ్మడూ మరో తపేలాతో నీళ్ళు తెచ్చి, ఆవు నాలుగు కాళ్ళూ కడిగారు. పసుపు పొట్లాం విప్పి, ఆకులో వేసి ముద్ద చేసేరు. కాసింత తీసి, ఆవు నుదుటికి రాసారు. దాని మీద కుంకుమ బొట్టు పెట్టేరు.

అప్పటికి టైం పదకొండు గంటలు దాటిందేమో, ఎండ చుర్రుమని తగులు తోంది. కిష్టయ్య కాసిన్ని నీళ్ళు తీసి కాసింత నేల అలికి, ముగ్గు పెట్టాడు. ఒక ఆకులో పసుపు ముద్దతో విఘ్నేశ్వరున్ని పెట్టి, ఎండిపోయిన ఓ గరికపూస దానికి గుచ్చేడు. వండిన పరమాన్నంలోంచి కొంత కొంత మూడు విస్తర్లలోనూ వేసి మూడు మడపాలు ముగ్గు మీద ఉంచాడు. అరటిపళ్ళు పెట్టాడు. అగరొత్తులు వెలి

గించాడు. తూర్పుకెదురుగా నిలబడి రెండు చేతులూ జోడించి దేవుడ్ని ప్రార్థించాడు. తరువాత చుట్టూఉన్న పిల్లగాళ్ళని పిలిచి ఒక్కొక్కర్ని దేవుడ్ని ప్రార్థించమని చెప్పాడు-"గోవుల్ని కాసిన గోపాల కిష్టా! మా మొరాలించి, మమ్మల్ని రచ్చించు. మా గొడ్డూ గోదా బతికించు" అని. పిల్లలందరూ ఒక్కొక్కరూ దేవుడికి మొక్కాక, అందరూ కలిసి మళ్ళీ ఆవు కాళ్ళకు మొక్కారు.

ఆ తర్వాత ఒక క్షణం అందరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు. ఆవు పెనుగులాట రాను రాను పెరిగిపోతోంది. అది చూసి కిష్టయ్య ఒక ఆకుతో మడపాము తీసి ఆవు ముందర పెట్టాడు.

ఆకలితో ఉన్నదేమో ఆవు ఆబగా తినేసింది అంతా. కిష్టయ్య సంతృప్తిగా ఊపిరి పీల్చుకొన్నాడు. 'ఇక ఆవు ఉపవాసము చెల్లింది. కాబట్టి మేపుకు విప్పెయ్యమన్నాడు. ఏసేబు ఆవు మెడకట్టు తప్పించేడు.

అప్పటికి మిట్టమధ్యాహ్నం దాటింది. "యిక మనమూ ఉపాసం చెల్లిద్దాము పదం"డని అందరూ సహపంక్తిగా కూర్చుని మిగిలిన పదార్థాలను తృప్తిగా తిన్నారు. కిష్టయ్యకు యిప్పుడు సంతోషంగా ఉంది. అనుకున్న పని నిరాటంకంగా పూర్తిచేసేడు. 'ఒకటి రెండు రోజుల్లో యిక తప్పక వర్షం కురుస్తుం' దన్న నమ్మకం ఆతనికి కలిగింది.

సాయంత్రం కావస్తోంది. ఎండ తీక్షణత తగ్గిపోయింది. 'పశువుల్ని యిక తోపుదాం,' అని అందరూ లేచారు. కిష్టయ్య సామానులు సంచిలోకి సర్దేశాడు.

వాతావరణంలో మార్పు వచ్చింది. అయినా గాలి మాత్రం వేడిగానే వీస్తోంది. కిష్టయ్య అప్రయత్నంగా తల పైకెత్తి ఆకాశంలోకి చూశాడు. కానీ ఎక్కడా మేఘాల జాడ లేదు. గోనెసంచిని భుజాన పెట్టుకొని, నడుస్తున్నాడు. క్రమేపీ గాలి కూడ చల్లబడింది. చూస్తూండగానే సూర్యుడు అస్తమించేశాడు. ఊరు ఇంకా చాలా దూరంలో ఉంది. పిల్లలు పశువుల్ని వడివడిగా అదిలిస్తున్నారు. కిష్టయ్య వెనుకగా నడుస్తున్నాడు.

సన్న సన్నగా చీకట్లు కమ్ముతున్నాయి. అప్పుడే పొద్దు మునిగింది. 'అప్పుడే చీకటేమిటా?' అని కిష్టయ్య మూట క్రిందికి దించి, తల పైకెత్తి చుట్టూ చూసాడు. ఉత్తర దిక్కున మేఘం నల్లబడింది. గాలి రివ్వున వీస్తోంది. చీకట్లు క్రమేపి ముదిరిపోతున్నాయి. మేఘం కూడ క్రమేపి అంతా నల్లదనాన్ని అలుముకుంది. కిష్టయ్య మనసు ఆనందంతో తేలిపోతోంది. "యివాళ తప్పకుండా వర్షం పడుతుంది.. తప్పక పడుతుంది" అని తెగ సంబరపడుతున్నాడు. ఆ ఆనందంలో అడుగులు తొట్రుపాటు పడుతున్నాయి.

గాలి విసురు పెరిగిపోయింది. దాని ప్రక్కనున్న చెట్లు పడిపోతాయా అన్నట్టు వూగుతున్నాయి. చిటపట మని రూపాయి కాసంత చినుకులు అక్కడొకటీ....యిక్కడొకటీ పడుతున్నాయి. కిష్టయ్య చేతి మీద కూడా ఓ చినుకు

పడింది. అతని ఒళ్ళు పులకరించింది. అతడు సంతోషం పట్టలేకుండా ఉన్నాడు. తన చేతిని నోటిదాకా తీసుకొని 'ఇది అమృతం సుమా' అన్నట్టు నాలుకతో నాకాడు కిష్టయ్య.

ముందు నించీ పిల్లలి కే రి ం త లు ఎక్కువయ్యాయి. వర్షం పడుతోంది. వాళ్ళ ఆనందానికి అంతులేకుండా వుంది. "తాతా....తాతా....రారా...." అ ం టూ కేకలు వేస్తున్నారు. పళువుల్ని మరింత జోరుగా తగులుతున్నారు. కిష్టయ్య పరుగు నడకన నడుస్తున్నాడు. చినుకులు క్రమేపి ఒత్తుకున్నాయి. జల్లులు జల్లులుగా కురుస్తున్నాయి.

ఊరులో కొచ్చేసరికి ఊరంతా గాఢాంధకారంగా ఉంది. ఎక్కడా ఏమీ కనిపించడంలేదు. కానీ దగ్గర్లోనే డప్పుల శబ్దం వినిపిస్తోంది. వానకు త డి సి డప్పులు సరిగా శబ్దం చేయటంలేదు. 'తపక్....తపక్'మని మోగుతున్నాయి. గాలికి వీధి దీపాలు ఆర్పేసినట్టున్నారు. కాగడాలు వెలిగించడానికి వాన పడుతోంది. చీకటిలోనే దేవుని ఊరేగింపు సాగుతున్నది.

బొమ్మలాళ్ళంతా ఊరేగింపు వైపు వెళ్ళారు. రథము చుట్టూ ఓ....హో ఏమి జనం. వర్షం పడుతున్నా ఎవ్వరూ తగ్గలేదు. ఒక్కొక్కరు తడిసి ముద్దయ్యారు. అయినా ఎవ్వరూ కదలడంలేదు. అందరికీ మంచి ఉత్సాహంగా ఉంది. ఆనందముతో గెంతులు వేస్తున్నారు. 'పండుగంటే యిదే సుమా' అన్నంతగా పొంగిపోతున్నారు.

ఊరేగింపు ముగిశాక, పంతులుగారు దేవుని విగ్రహాలను రామ మందిరంలో పెట్టించారు. కొబ్బరి చెక్కలూ, అగరు వత్తులూ, అరటిపళ్ళూ వర్షానికి బాగా నాని పోయినాయి. డబ్బుల హుండీ రథము మీంచి దించి గర్భగుడిలో పెట్టించారు. ఆ రోజుతో "మొత్తం కార్యక్రమం ముగిసిం"దని పంతులుగారు ఆనందముగాచెప్పారు. ఇదంతా చూసి కిష్టయ్య నవ్వుకుంటూ యింటికెళ్ళాడు.

వర్షం ఏకంగా మూడు రోజులు ఎడతెరిపి లేకుండా పడింది. ఇంట్లోంచి మనుషులు వీధిలోకి రావడానికి వీల్లేకుండా కురిసింది. అయినా ప్రజలకి ఏమీ ఇబ్బంది అనిపించలేదు. 'ఎన్నాళ్ళకో వర్షం పడుతోంది. అ ం తే ....అ దే చా లు'.... ఆ సంతోషంలో దేన్నీ లెక్కచేయడం లేదు వాళ్ళు.

నాలుగో రోజు తెల్లగా తెల్లవారింది. ఆకాశంలో మబ్బులన్నీ ఎటు వటు ఎగిరిపోయి, సూర్యునికి దా రి చ్చే సే యి. తూర్పు నుంచి బంగారు కిరణాలతో సూర్యుడు తన ప్రయాణానికి సిద్ధమయ్యాడు.

ఊరి జనమంతా ఒక్కసారి వీధుల్లో కొచ్చారు. అందరి మొఖాల్లోనూ ఆనందం తొణికిస లాడుతోంది. ఎక్కడ చూసినా గుంపులు - గుంపులుగా జనం కూడి చర్చలే. అందరి మాటల్లోనూ నానుతున్నది 'వర్షమ్'... తమ ఊళ్ళో రెండు సంవత్సరాలు దాటి మూడవ సంవత్సరములో వర్షం పడింది - అందులోనూ యింత పెద్ద వర్షం! అందరిలోనూ కృత

జ్ఞతాభావం వెల్లివిరుస్తోంది. కొందరు 'పంతులుగారి మాట ఫలించిం'దన్నారు. మరికొందరు 'పురాణం బాగా చెప్పా'రన్నారు. ఇంకొందరు 'వచ్చిన పండితుడు శానా గొప్పవా'డన్నారు. ఇలా తలో రకంగా దేవుని కల్యాణం గురించీ, అయిన ఖర్చు గురించీ, ప్రెసిడెంటుగారి ఔదార్యం గురించి - రకరకాలుగా మాట్లాడుకున్నారు.

కిష్టయ్యకు యివన్నీ తెలుస్తునే ఉన్నాయి. అతను చిర్నవ్వు నవ్వుకున్నాడు. అతని ఉద్దేశంలో 'భగవంతుడు పశువుల మొర ఆలకించి వాన యిచ్చాడు గాని, ఈ మనుషులు చేసే పూజలవల్ల గా'దన్నది అతడి బలమైన నమ్మకం. ఒకవేళ అలాగే అయితే నెల రోజులపాటు పురాణం సదవగా, యే రోజన్నా కాసింత మబ్బేసిందా? అలాంటిది మూడు రోజులుగా కుండపోత వర్షం కురిసింది ఒక్కసారిగా. ఏదిఏమైనా వాన పడింది. అంతే చాల"ని సంతృప్తి పడ్డాడు కిష్టయ్య.

కిష్టయ్య వీధిలోంచి అలా రామ్మందిరం వేపు నడిచాడు. కాసేపు అక్కడ కూర్చున్నాడు. పంచాయితీ ఆఫీసులోంచి మళ్ళీ రేడియో గోల వినబడుతోంది. దగ్గర కావడంవల్ల రేడియోలోంచి వచ్చే సంగీతం పెద్ద సౌండుతో చికాకుగా ఉంది. "పోదాం" అని లేచి నిలబడ్డాడు. ఇంతలో ఆకాశవాణి 'వాతావరణం'అన్న మాట వినబడింది. కిష్టయ్య శ్రద్ధగా విన్నాడు.

"బంగాళాఖాతంలో ఏర్పడ్డ వాయు గుండం వల్ల గత మూడు రోజులుగా ఉత్తర కోస్తా అంతటా భారీ వర్షాలు పడ్డాయి. అయితే నేడా వాయుగుండం ఈశాన్య దిశగా పయనించి ఒరిస్సాలో తీరం దాటిందని వాతావరణ శాస్త్రజ్ఞులు తెలియజేసారు."

కిష్టయ్య ముఖం ఒక్కసారిగా కళ తప్పింది. అక్కడి నుంచి మెల్లగా కదిలాడు ఇంటికి.

"అయితే మనూరులో మూడురోజులు ముసురు పెట్టడం పురాణం సదవడం వల్ల కాదన్నమాట!"అని నవ్వుకున్నారు వూరి జనం.

ప్రజలు అనుకుంటున్న మాటలు కిష్టయ్య చెవులకి కూడా సోకాయి.

ఇప్పుడు కిష్టయ్య మనసు తేలిక పడింది.

జనం పాట:

# చదువులకే బేరం

వెంకన్న

లంచగొండి నేదురుమల్లి గాని
రంకెలు చూడురన్నయో
విర్రవీగుడ చూడురన్నయో
వీని కంతిరి మీరిన చేష్టలతోని
  వీని కాలం మూడెనన్నయో
  వీని మురిపెం కూలుత దన్నయో॥
చదువులతల్లి ని సంతలపెట్టి
సాహా రాజుల కేలం వేసి
వందల కోట్ల లంచం మింగిన
కొంచెపు బుద్ధుల కొడుకును చూడు
  గుడినే మింగిం డన్నయో
  గుడి లింగమే మింగుత డన్నయో॥
వాకాడులో ఆరంభించిన
బోకర్‌గిరి బోసానం పట్టి
చదువులకేమో బేరం పెట్టి
పేదల కిద్యను దూరం చేసిన
  వీడు మనువు సంతతి కొడుకురో
  వీని కండ్లుల కారం గొట్టరో॥
ఉన్నోళ్ళ డబ్బుతో లేనోళ్ళ పిల్లలకు
ఉచితంగ విద్య చెప్పిస్త డంటీడు
ఉన్నోని దగ్గరి ఉన్న డబ్బెవ్వనిది
పేదోళ్ళ కష్టపు సెమట సుక్కలు కావా
  వీడు తేనే పూసిన కత్తెరన్నయో
  తెలుసుకోపోతే బలి అవుతా మన్నయో॥
ఒకొక్క సీటుకు ఆరేసి లక్షలు
వసూలుచేసి సీటు అమ్ముకుంటాడంట
పరీక్షలల్లేమి రాయక పోయిన
ఫస్టు క్లాసులోనే పాసయితారంట
  విర్రవీగేటి పెద్దోళ్ళ కన్నయో
  విద్య వడ్డించిన విస్తరేనన్నయో॥

అసమ్మతోని పగ అంతకంతకు పెరిగి
ముఖ్యమంత్రి పదవి ముక్కోడి ముక్కాయె
బోర్డు చైర్మెన్ అచ్చి బుజ్జగించ వట్టి
బ్రోకర్ గిరితోన దీవెనందా వట్టి
కాసులు రాలేటి వైద్య కాలేజీల
మంజూరు చేసిండు మస్కాలు గొడుతుండు
పదవి నిలుపు కొనుట కన్నయో
పిని పాట్లు చెప్పరాదు రన్నయో॥
రైతుకు లన్నలు రాశి బోసిన పంట
కార్మికుల ఊపిరితో పోగైన ఉత్పత్తి
దోసి మోసుకపోయే సామ్రాజ్యవాదుల
సోపతున్న పీని సొల్లు వాగుడు చూడు
విద్య వైద్య రంగ మిఫలమైనవంటా
ప్రభుత్వ పరిశ్రమలు పడెనంట నష్టంలో
సంక్షేమ పథకాలు ఫలితాలు లేవంటా
సర్కారు బడులకూ పైసలు లేవంట
పోలీసు మిల్ట్రీవే మేలైన సేవంట
అందుకే వాళ్ళకు అధిక వాటాలంటా
పీని సిగ్గు తప్పిన కూతలన్నయో
నమ్మి మోసపోతే కష్టం అన్నయో॥
భూమి లేనోళ్ళంత భూ మడిగిన తప్పే
బువ్వలేనోళ్ళంత సమ్మెచేసిన తప్పే
గోసి బట్ట లేక గోస తీసేటోళ్ళ
భాగ్య మెందుకు మీకు త్యాగాలు చేయమనే
అధికారముంటే చాలు అన్నల చంపుతనే
హక్కు లడిగెటోళ్ళ అంతు చూస్తాననే
ఊర్ల ల దొరలతో ఉంటమీ బంటుననే
లంచగొండి అధికార్ల పంచకు చేరుకునే
బతుకునిల్పె, డాక్టర్లంత పోరుబాట పడితే
బరి తెగిన ఈ కొడుకు, బందూకు చూపిండు
వీడు ఎంతకయిన తెగుతడు రన్నయో!
మనిషి రూపమున్న యముడు రన్నయో!
వీడు వెయ్యి పడగల నాగు రన్నయో!
ఎదిరించపోతే బతుక మన్నయో॥

# కన్యాశుల్కంలో కుటుంబ వ్యవస్థ

## కాత్యాయనీ విద్మహే

స్త్రీ పురుష సంబంధాల పరిణామ చరిత్రలో దాంపత్య సంబంధాలను స్థిరీకరిస్తూ వివాహ వ్యవస్థ రూపుదిద్దుకోవటం, తద్వారా కుటుంబ వ్యవస్థ ఏర్పడటం అత్యంత ముఖ్యమైన ఘట్టాలు. వ్యక్తిగత ఆస్తి ఏర్పడటం, దానిని వారసత్వంగా తనదైన సంతానానికి అందచేయాలన్న పురుషుడి ఆకాంక్ష కుటుంబ వ్యవస్థ ఏర్పడటానికి తక్షణ కారణాలైనాయి. అంతవరకు సంతానం మీద స్త్రీలకున్న హక్కును కుటుంబ వ్యవస్థ త్రోసి రాజన్నది. తన ప్రాథమిక హక్కును కోల్పోయి పరాజితురాలయిన స్త్రీ, ఆ స్త్రీకి, ఆస్తికి, సంతానానికి కూడా అధికారి అయిన పురుషుడు- వీళ్ళిద్దరి సహజీవనంతో ప్రారంభమైన కుటుంబ వ్యవస్థ స్త్రీ పురుషుల అసమ సంబంధాల మీద నిర్మించబడింది. కనుకనే గురజాడ అప్పారావు "మగవాళ్ళ అధికారం కింద, పెత్తనం కింద బానిసలుగా ఆడవాళ్ళు ఎలా పడి వున్నారో, ఎంత క్రుంగిపోతున్నారో" సులభంగానే ఊహించగలిగాడు. (ఒంగోలు ముని సుబ్రహ్మణ్యానికి వ్రాసిన లేఖ, 2 జూన్ 1909).

1892 ఆగస్టులో కన్యాశుల్కం నాటకాన్ని ప్రదర్శించటానికి అనుకూలంగా వ్రాతప్రతి వ్రాసి, 1897లో దానిని అచ్చువేసి, ఆ నాటకంలో ఇతివృత్తపరంగా తాను చర్చించిన అనేకానేక విషయాల గురించి, ముఖ్యంగా కుటుంబంలోనూ, బయటా స్త్రీల స్థితిగతుల గురించి తనలో తాను ఆలోచించుకొంటూ, తర్కించుకొంటూ, ప్రశ్నించుకొంటూ, సమాధానాలు వెతుక్కొంటూ ఆ క్రమంలో 1909 నాటికి కన్యాశుల్కం నాటకాన్ని తిరిగి వ్రాశాడు గురజాడ అప్పారావు. కుటుంబ వ్యవస్థలో భార్యాభర్తల మధ్య కొనసాగుతున్న బానిస-యాజమాని సంబంధాలను, ఆడవాళ్ళను తక్కువగా చూచే పితృస్వామిక సంస్కృతిని, కుటుంబ సంబంధాలను మత ప్రమేయాలకు లోబరచిన భావజాల వ్యవస్థను మన అవగాహనకు అంది వచ్చేట్లుగా నాటకేతివృత్తంలో భాగం చేశాడు. కన్యాశుల్కం నాటకంలోని కుటుంబాలను, ఆ కుటుంబాలలో వ్యక్తుల మధ్య వున్న సంబంధాలను అధ్యయనం చేస్తే మనకీ విషయాలు స్పష్టపడతాయి.

కన్యాశుల్కం నాటకంలో కనిపించే కుటుంబాలు రెండు. అగ్నిహోత్రావధానుల కుటుంబం, లుబ్ధావధానుల కుటుంబం. అగ్నిహోత్రావధానుల కుటుంబంలో ఆయన, ఆయన భార్య వెంకమ్మ, పెద్దకూతురు బుచ్చమ్మ, రెండో కూతురు సుబ్బమ్మ, కొడుకు వెంకటేశం సభ్యులు. నాటక కథకు కేంద్ర బిందువు సుబ్బిపెళ్ళే అయినా, సుబ్బిపాత్ర మాత్రం నాటకంలో ఎక్కడ కనిపించదు. పితృస్వామ్య

కుటుంబ వ్యవస్థ ఇంటికి యజమానిగా అధికారస్థానంలో అగ్నిహోత్రావధాన్లను ఉంచింది. ఇల్లు ఆయనది. ఆస్తి ఆయనది. నిర్ణయాలు ఆయనవి. వాటి నెవరూ ప్రశ్నించటానికి గానీ, అభ్యంతరం పెట్టడానికి గానీ వీలులేదు. కనుకనే ఆయన భార్యతో సంప్రదించకుండానే చిన్నకూతురు సుబ్బిపెళ్ళి లుబ్ధావధానులతో కుదర్చ గలిగాడు. "నాకు చెప్పకుండానే నిర్ణయం చేశారా" అని అంగలారుస్తున్న భార్యకు "ఆడముండల్తోనా ఆలోచన" (కన్యాశుల్కం రెండు కూర్పులు, విశాలాంధ్ర ప్రచురణ, 1986, పుట : 21) అని ఒక్కమాటలో సమాధానం చెప్పి తేలిగ్గా ఆమె అభిప్రాయాన్ని కొట్టిపారేశాడు. భూస్వామ్య ఆర్థిక సంబంధాలలో పుట్టి పెరిగి ఆడ వాళ్ళ పట్ల అంత చులకన భావం ఏర్పరచుకోవటమే గాక అభివృద్ధి చెందుతున్న పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో తన కొడుకును ధనికవర్గంలో చేర్చేందుకు, తన కూతు ళ్ళనే పెట్టుబడిగా పెట్టగలిగినంతగా ఆడపిల్లల పట్ల తక్కువ చూపును అతను పెంచు కొన్నాడు. పదిహేను వందల రూపాయలు కన్యాశుల్కం తీసుకొని, పెద్ద పిల్ల బుచ్చమ్మను వృద్ధుడికిచ్చి పెళ్ళిచేసి అల్లుడు చచ్చిపోయాక అతని భూములకు దావా తీసుకొచ్చి తన ఆస్తిని పెంచుకొనే ప్రయత్నంలో పడ్డాడు. రెండోపిల్ల సుబ్బిని పద్దెనిమిది వందల రూపాయల కన్యాశుల్కానికి లుబ్ధావధానుల కిచ్చి పెళ్ళి చేయ టానిని నిర్ణయించి, కొడుకు పెళ్ళికి కావలసిన డబ్బు సంపాదించటానికి ప్రణాళిక వేశాడు. లుబ్ధావధానులు చనిపోయాక, అతని ఆస్తినంతా తన ఆస్తిలో కలిపేసుకొనే వ్యూహం అతని బుర్రలో వుండనే ఉంది. తనకంతగా ఇష్టం లేకపోయినా భార్యను సాధిస్తూనే అయినా కొడుకుకు ఇంగ్లీషు చదువు చెప్పించటం కూడా ఏ మునసబో, పోలీసో అయి కొడుకు ఆస్తులు సంపాదిస్తాడనే. కొడుకు విలువ గొప్పది అన్న సంస్కృతిలో వాడే కనుక అగ్నిహోత్రావధాన్లు ఆ కొడుకు మళ్ళీ మళ్ళీ ఫెయిలవు తున్నా, అవుతున్న ఖర్చును తలుచుకొని అగ్గిరాముడిలా మండిపడుతూనే చదువుకు కావలసిన డబ్బు సమకూరుస్తూనే వున్నాడు.

"మా యింట్లో భోజనం యంతమాత్రం వీలుపడదు" (పు 16) అని ఎంత మొరటుగా గిరీశం రాకను వ్యతిరేకించినా, కొడుకు చదువుకోసమైతేనేమి, ఆస్తి విషయంలో తన కోర్టు వ్యవహారాలు చూచి పెడతాడనైతేనేమి చివరకు గిరీశాన్ని తన ఆప్తవర్గంలో చేర్చుకొన్నాడు అగ్నిహోత్రావధాన్లు. 'సుబ్బి పెళ్ళికి సాయంగా వుండి పనులు చేసిపెట్టా'లని కూడా కోరాడు.

సుబ్బి చిన్నపిల్లే గనుక లుబ్ధావధాన్లతో తండ్రి నిర్ణయించిన వివాహాన్ని ప్రశ్నించను కూడా లేకపోయింది. "తమ్ముడి పెళ్ళికోసం దాని కొంపముంచి లుబ్ధావ ధాన్లుకి యివ్వొద్దని" (పు 28) పెద్దకూతురు బుచ్చమ్మ చెబితే, "ఆడపిల్ల తనకు నిర్ణ[illegible]న్ని మార్చుకోమని • సలహా యిచ్చేటంతటిదా" అని తింటున్న పెరుగు అన్నంతో విస్తరి తీసుకెళ్ళి బుచ్చమ్మ నెత్తిన రుద్దేసి తన నిరసనను, ఆధిక్యతను

ప్రకటించిన తండ్రి అగ్నిహోత్రావధానులు. ఆ వరుసలోనే "ఆ సమ్మంధం చేస్తే నూతులో పడతా" (పు 29) నన్న భార్య మాటను కూడా ఖాతరు చేయడు. అన్నంత పని ఆమె చేసినా అతనికి ఏమీ కష్టనష్టమైనా వుండదు. గిరీశంతో వెళ్ళిపోయిన బుచ్చమ్మను 'ఫకీరుముండ' (పు 1[illegible]) అని తన కోపాన్ని, అసహ్యాన్ని ప్రదర్శించటమే కాక వితంతువుల మఠం చేరిన బుచ్చమ్మకు ఆమె ఆస్తిని దక్షిణలు పరచమని చెప్పిన సౌజన్యారావు పంతులు పట్ల అసహనాన్ని వ్యక్తపరచిన అగ్నిహోత్రావధానులు, బుచ్చమ్మకు 'ఘటశ్రాద్ధం' పెట్టి (పు 185) తన పిల్ల అన్న బంధం తెంచేసుకోవటానికి సిద్ధపడతాడు. పితృస్వామిక దురహంకారానికి పరాకాష్ఠ రూపమిది.

ఈ రకమైన తండ్రికి కొడుకుగా వెంకటేశం కూడా పితృస్వామిక దురహంకారానికి తనకు తెలియకుండానే వారసుడయినాడు. తమ స్వప్రయోజనాల కోసం అన్ని సంస్థలను, వ్యవస్థలను వాడుకోగలిగిన గిరీశం లాంటివాళ్ళు ఆడవాళ్ళ మనస్తత్వాన్ని కాచి వడబోసినట్లుగా ఫెమినైన్స్ పూల్సని ఎవరి మాటలుగానో చెబుతూ, 'నగలతో ఆడవాళ్ళ నోరు మూయించవచ్చు'నన్నట్లు చెప్పే పాఠాలు (పు 29) ఆ వారసత్వాన్ని, తెలిసి స్వీకరించి సమర్థించుకొనే తెలివి తేటలను యిస్తాయి. 'దేవుడు ఆడవాళ్ళను సృష్టించింది ఎందు'కని గిరీశం ప్రశ్నిస్తే, 'వంట చేయటానికి' (పు 58) అని టక్కున సమాధానం చెబుతాడు. బాల్యం పూర్తిగా వీడని వెంకటేశానికి తెలిసిన సమాధానం అదయితే, యువకుడైన గిరీశం ఆడవాళ్ళ వల్ల మరొక ఉపయోగం కూడా తెలిసినవాడై ఆడవాళ్ళను 'దేవుడు సృష్టించింది పెండ్లాడడముకూ, పిల్లలను కనడముకున్నూ' (పు 58) అని వెంకటేశం సమాధానానికి ముక్తాయింపునిస్తాడు. పితృస్వామిక కుటుంబ సంస్కృతివల్ల ఆడవాళ్ళు మగవాళ్ళకన్నా తక్కువ అన్న భావం మనసున బాగా నాటుకుపోయింది కనుకనే, వెంకటేశం అక్కగారైన బుచ్చమ్మతో మాట్లాడటం ప్రారంభించిన రెండు మూడు నిమిషాల్లోనే రెండుసార్లు 'నువ్వు ఆడదానివి నీకేం తెలియదు' (పు 60) అని, 'ఆడదానివి నీకెందుకూ' (పు 61) అని చులకనగా మాట్లాడతాడు. కుటుంబం అన్నదమ్ములను కూడా ఆడవాళ్ళపై అధికార స్థానంలో ఎలా వుంచుతుందో ఈ సన్నివేశాన్నిలా చిత్రించటం ద్వారా గురజాడ నిరూపించాడు.

ఈ నాటకంలో కనబడే మరొక కుటుంబం లుబ్ధావధానులది. ఆ కుటుంబంలో ఆయన, ఆయన కూతురు మీనాక్షి తప్ప మరొకరు లేరు. పితృస్వామిక కుటుంబ యజమానిగా, ఆడవాళ్ళ జీవితాలను నిర్దేశించే అధికారస్థానంలో వుండి, తీసుకోవలసిన నిర్ణయాలను ఏనాడో తీసుకొన్నాడు లుబ్ధావధాన్లు. మీనాక్షికి వృద్ధుడికిచ్చి పెళ్ళి చేయటం, ఆమె వితంతువై ఇల్లు చేరటం కథా ప్రారంభానికే జరిగిపోయిన ఘటనలు. లుబ్ధావధానుల భార్య ఏనాడో చనిపోయింది. తండ్రీ కూతుళ్ళిద్దరూ సమానమైన

దుస్థితిలోనే వున్నారిప్పుడు. అయితే స్త్రీ పురుషులు సమానమన్న చైతన్యం లుబ్ధావధాన్లకు లేదు. 'మగవాడు భార్య చనిపోతే ఏ వయసులోనైనా సరే మళ్ళీ పెళ్ళి చేసుకోవచ్చు. ఆడది మాత్రం భర్త చనిపోతే ఎంత యవ్వనంలో వున్నా సరే మళ్ళీ పెళ్ళి చేసుకోరా'దన్న మనుధర్మ సంస్కృతిని జీర్ణం చేసుకొన్నవాడు కనుక, కూతురికి మళ్ళీ పెళ్ళి అన్నమాటే తలచకుండా అరవైఏళ్ళు దాటిన తాను మాత్రం మళ్ళీ పెళ్ళికి సిద్ధపడతాడు. రామప్ప పంతులు మాటలతో ఆ వయసులో సంతానాన్ని కని, వంశాన్ని వృద్ధి చేసుకోవాలని, ఆస్తికి వారసులను తయారుచేసుకోవాలని ఆశపడతాడు. పితృస్వామిక కుటుంబ యజమానిగా మీనాక్షి ఆశలమీద, కోర్కెలమీద నిఘా వేస్తూ, ఆమెను అదుపు చేయటానికి విఫల ప్రయత్నం చేస్తూ, కట్టు దప్పిపోతున్న మీనాక్షిని అదుపులో వుంచటానికైనా తనకొక భార్య అవసరమని నమ్మ

ఇంతా చేసి తాను చచ్చిన మరుక్షణం కూతురు 'రాజమహేంద్రం' వెళ్ళిపోయి మళ్ళీ పెళ్ళి చేసుకొంటుందేమోనన్న భయం, అనుమానం అతనికి ఉండనే వున్నాయి. చివరకు రామప్ప పంతులుతో వుండటం చూచి "పో ముండా నువుకూడా నా యింట్లోంచి" (పు 155) అని మీనాక్షిని బయటకు గెంటేయటంలో లుబ్ధావధానుల పితృస్వామిక దురహంకారమే కనబడుతుంది తప్ప, తన కూతురు కూడా 'శరీరము హృదయము, మెదడు' వున్న మనిషన్న మానవీయ చైతన్యం కనబడదు. కానీ తానిరుక్కున్న చిక్కులవల్ల కలిగిన అనుభవజ్ఞానం నుండి లుబ్ధావధాన్లు ఆ దురహంకారం నుండి విముక్తుడవుతాడు. "ఇంత డబ్బుండినీ డబ్బుకి లోభపడి ఒక్కగానొక్క కూతుర్ని ముసలివాడికి అమ్మాను. నా జీవితానికి ఉసూరుమంటూ అది కాని తిరుగులు తిరిగిందంటే దాని తప్పా?" (పు 169) అని ఇన్నాళ్ళ మీనాక్షి ప్రవర్తనను మీనాక్షి దృష్టికోణం నుండి అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తాడు. మీనాక్షిని వితంతువుల మఠానికి పంపి, ఆమెకు ఇష్టమై అక్కడే వుండాలనుకొంటే కావలసిన డబ్బివ్వాలని నిర్ణయించుకొంటాడు.

కన్యాశుల్కంలో కనిపించే ఈ రెండు కుటుంబాలతో పాటు కనిపించని మరో రెండు కుటుంబాలు కూడా వున్నాయి. ఒకటి కరటక శాస్త్రి కుటుంబం, మరొకటి పోలిశెట్టి కుటుంబం. వాళ్ళ కుటుంబ సంబంధాల గురించి వాళ్ళ మాటల ద్వారా, వాళ్ళ ప్రవర్తన ద్వారా తెలుసుకోవచ్చు. కరటక శాస్త్రికి భార్యా, కూతురు వున్నారు. అయితే వాళ్ళిద్దరూ ప్రస్తావనా వశంగా వచ్చేవాళ్ళే కానీ, ప్రత్యక్ష పాత్రలు కారు. అట్లాగే పోలిశెట్టికి కూడా భార్య, పిల్లల తల్లి అయిన కూతురు (కన్యాశుల్కం, పు 93) తండ్రి చేతి వ్యాపారం అందుకోగలిగిన వయస్సున్న కొడుకు (కన్యాశుల్కం, పు 128) వున్నారు. ఇంకా చిన్నపిల్లలు కూడా వుండి వుండవచ్చు. (కన్యా

శుల్కం, పు 196). ఇంత పెద్ద వయస్సున్న పిల్లలు, ఇంతమంది పిల్లలు వుండి కూడా పోలిశెట్టి మాత్రం మధురవాణితో సరస సల్లాపాలతో కాలక్షేపం చేయటానికి మిగిలిన వాళ్ళతో కలిసి వెళ్ళి పేకాట ఆడుతుంటాడు. ఆ సందర్భాలలో ఎప్పుడూ తన భార్యను తలచుకోనివాడు, ఆమెకు అన్యాయం చేస్తున్నానన్న ఆలోచన అయినా రానివాడు, లుబ్ధావధానుల తరఫున సాక్ష్యం చెప్పమని సౌజన్యారావు పంతులు అడిగి నప్పుడు మాత్రం తప్పించుకోవటం కోసం తన భార్యను అడ్డు వేసుకొంటాడు. "మా యింట్లోళ్ళకి ఉద్దోలమైన జబ్బుగా వుందని కబురొచ్చింది. నేను వెళ్ళిపోవా" లని అంటాడు పోలిశెట్టి. అన్ని కుటుంబాలలో లాగానే పోలిశెట్టి కుటుంబంలోకూడా అతని భార్యది మౌన వేదనే. కరటక శాస్త్రి భార్య అలాంటిది కాదు. ఆడవాళ్ళ కొక నీతి, మగవాళ్ళకొక నీతి అమలవుతున్న పితృస్వామిక కుటుంబ వ్యవస్థపై తన ధిక్కార స్వరాన్ని వినిపిస్తుందామె. కరటక శాస్త్రి మధురవాణి దగ్గరకు వెళ్ళి వస్తుండటం ఆమెకు తెలుసు. దానిని నివారించగలిగిన శక్తి సామర్థ్యాలను ఈ సమాజం ఆమెకివ్వలేదు. తనకు ఇష్టంలేని, తనను అవమానపరిచే పనులు చేస్తున్న భర్తను వదిలేసి కుటుంబ వ్యవస్థా చట్రాన్ని అతిక్రమించి వెళ్ళటానికి అనువైన వాతావరణ పరిస్థితులు సమాజంలో లేవు. అందువలన ఆమె అతనితో కుటుంబ సంబంధాలలో వుంటూనే అతని ప్రవర్తన పట్ల తన నిరసనను తనకు చేతనైన పద్ధతులలో ప్రదర్శించింది. అందులో భాగమే కరటక శాస్త్రికి ఇష్టం లేక పోయినా పెరట్లో దొండ పాదుందని ఎప్పుడూ దొండకాయ కూరే వండటం. మధురవాణి దగ్గరకు వెళ్తొస్తుంటాడని సాధించి నిందించటం. కరటక శాస్త్రి భార్య యొక్క ఈ ప్రతిఘటనా స్వభావం కరటక శాస్త్రి ద్వారా కాస్తో కూస్తో మధురవాణికి తెలిసి వుండాలి. అందుకనే మధురవాణి తన దగ్గరకు వచ్చి పెళ్ళి గిరీశం వెంకమ్మ గారింట చేరాడని తెలిసి వాడికి పెందరాళే ఉద్వాసన చెప్పాలని కరటక శాస్త్రి అను కొన్నప్పుడు "నా దగ్గరకు వచ్చినందుకు మీ భార్యగారు ముందు మిమ్మల్ని మెడ బట్టుకొని యింట్లోంచి తరమవలసింది" అని ఆమె స్వభావ చర్యలను సమర్థిస్తు న్నట్లుగా అంటుంది. అప్పుడు కరటక శాస్త్రి "క్రియలలో అంతవరకూ జరక్క పోయినా మాటల్లో ఆ మర్యాద హమేషా నాకు జరుగుతూనే వున్నది" (కన్యా శుల్కం, పు 43) అంటాడు. పితృస్వామిక కుటుంబ వ్యవస్థలో ఇల్లు, సంపద, సంతానం - అన్నీ పురుషుడికి చెందినవే కనుక, పురుషుడు స్త్రీని మెడబట్టి బయటకు పంపగల అధికార స్థానంలో వుంటాడు కానీ, మెడబట్టి బయటకు గెంటించుకోగలి గిన హీన స్థానంలో వుండడు. ఇంటికి, సంపదకు, సంతానానికి పరాయిదిగా స్త్రీ మాత్రమే పురుషుడు ఎప్పుడు బయటకు గెంటినా వెళ్ళిపోవలసిన బలహీన సంబం ధాలతో కుటుంబంలో వ్యక్తిగా కొనసాగుతుంటుంది. సామాన్య లౌకిక జ్ఞానాన్ని బట్టి కరటక శాస్త్రి భార్యకు తాను భర్తను వెళ్ళగొట్టగల పరిస్థితులలో లేనని

తెలుసు. అందుకనే క్రియ వరకు పోలేని సామాజిక పరిస్థితులలో మాటలతో తన నిరసనను వ్యక్తం చేస్తుంటుంది. కడుపు మంట ఇంకా చల్లారకపోతే తనకు నిర్దేశించబడిన ఇంటి చాకిరిని యథాప్రకారం చేస్తూనే 'చీపురున్న చేతి'ని ఝాడిస్తుంది. ఇంట్లో భర్తల అధికార దౌష్ట్యాలను ప్రతిఘటించే క్రమంలో గయ్యాళితనాన్ని అల వరచుకొంటే తప్ప నెగ్గుకు రాలేని పరిస్థితికి నెట్టబడ్డ స్త్రీలకు ప్రతినిధిగా కనబడుతుంది కరటక శాస్త్రి భార్య.

తన సహజ స్వభావం వల్ల కావచ్చు, భార్య వ్యక్తిత్వ ప్రభావం వల్ల కావచ్చు, కరటక శాస్త్రి 'ఆడదాన్నైతే లోకాయించ కూడద' (కన్యాశుల్కం, పు 51) నే అవగాహనను అభివృద్ధి పరుచుకొన్నాడు. అగ్నిహోత్రావధాన్ల అధికారం క్రింద తన చెల్లెలు నలుగుతున్న వాస్తవ జీవితానుభవం కూడా అందుకు దోహదం చేసి వుంటుంది. అందువల్లనే తన ప్రవర్తన పట్ల భార్య నిరసనను ఏ విధమైన మొహమాటానికి, అల్పత్వ భావనకు లోను కాకుండానే వస్తుగత దృష్టితో మధురవాణికి, రామప్ప పంతులుకు కూడా మామూలు అంశంగా చెప్పగలిగాడు. కన్యాశుల్క దురాచారాన్ని నిజాయితీతో వ్యతిరేకించిన వాడు కరటక శాస్త్రి ఒక్కడే. మొదటి కూర్పులో కరటక శాస్త్రి శిష్యుడితో "మా అమ్మినిచ్చి పెళ్ళి చేస్తాను" అన్న సందర్భంలో శిష్యుడు "యన్ని వందలు పుచ్చుకొని కన్యాదానం చేస్తారేమిటి?" ప్రశ్నిస్తే "ఆ ఆచారం మా యింటా వంటా కూడా లేద"ని (పు.16) కొట్టిపారేస్తాడు. రెండవ కూర్పులో ఈ మాటల సారాన్ని పిల్లనిచ్చి కన్యాదానం చేస్తానన్న మాటల్లో ధ్వనింపచేస్తాడు (పు. 174) కన్యాశుల్కానికి వ్యతిరేకి కనుకనే అగ్నిహోత్రావధాన్లు సుబ్బిని లుబ్ధావధాన్లుకు అమ్మాలనుకొన్నప్పుడు "బావా, యీ సమ్మంధం చేస్తే నీ కొంపకి అగ్గెట్టేస్తాను" (పు 21) అని తన అభ్యంతరాన్ని స్పష్టంగా ప్రకటించాడు. సుబ్బి పెళ్ళి తప్పించటానికి తాను వేషం మార్చి, తన శిష్యుడికి ఆడవేషం వేసి లుబ్ధావధాన్లకిచ్చి మాయ పెళ్ళి జరిపించటానికి ఆడిన నాటకంలో తమ అవసరాల కోసం ఆడపిల్లలను అమ్ముకొనే తండ్రుల దౌర్భాల్యాన్ని, తల్లుల ఆలోచనలకు, అభిప్రాయాలకు వీసమెత్తయినా విలువ నివ్వకుండా, వస్తువును అమ్మ చూపినట్లుగా పిల్లను అమ్మచూపే పురుషాధిక్య కుటుంబ సంస్కృతిని 'రక్తం, మాంసం అమ్ముకొనే సంస్కృతి'గా చెప్తూ తీవ్ర విమర్శకు గురి చేశాడు కరటక శాస్త్రి.

కుటుంబ సంబంధాలలో లేకుండానే, కుటుంబం గురించిన సైద్ధాంతిక భావజాలాన్ని ప్రచారం చేస్తాడు రామప్ప పంతులు. కుటుంబం అంటే ఏమిటో, దాని ఆవిర్భావంలో వున్న సహజార్థాన్ని వ్యాఖ్యానించి చెప్పిన వాడతనే. జీవిత కాలంలో సంపాదించిన ఆస్తిని వారసత్వంగా సంక్రమింప చేయటానికి వీలుగాను, మరణించిన

తరువాత పరలోక ప్రయోజనాల కోసం కర్మకాండ నిర్వహించటానికి గాను సంతానం పుంశాలని, ఆ సంతానాన్ని పొందటం కోసం పెళ్ళి చేసుకొని, తద్వారా కుటుంబాన్ని ఏర్పరచుకోవటం తప్పనిసరి అని రామప్ప పంతులు అభిప్రాయం. లుబ్ధావధాన్లను మళ్ళీ పెళ్ళి చేసుకోమని ప్రేరేపించటంలో భాగంగా "కష్టపడి ఆర్జించిన డబ్బంతా ఎవడి పాలు చేస్తా"వని లుబ్ధావధాన్లను ప్రశ్నించటంలోను, "పరానికి యిన్ని నీళ్ళ చుక్కలు వొదిలే వాడుండాలా"—అని నిలదీయటంలోను (పు. 89) ఈ దృక్పథమే కనబడుతుంది. అయితే "మరి తమరెందుకు పెళ్ళి చేసుకున్నారు కారూ?" అని లుబ్ధావధాన్లు ఎదురుప్రశ్న వేస్తే, సంతానానికి వారసత్వంగా సంక్రమింప చేయాల్సిన పిత్రార్జితానికి తానేనాడో 'కరరాపుడు' చుట్టేశాడు కనుక, తనకు సంతానంతో పనిలేదంటాడు. ఇవ్వటానికి ఆస్తి లేకపోయినా, పరలోక ప్రయోజనాల కోసమైనా సంతానం కావాలి కదా. "తాను శాక్తేయుడు కనుక, కర్మతో తనకు పనిలేదు" అని తేల్చేసి, 'అందువల్ల తనకు సంతానం అక్కరలే'దంటాడు. సంతానంతో పని లేకపోతే స్త్రీ పురుష లైంగిక సంబంధాలే అవసరం లేదన్న అభిప్రాయం భారతీయ మత తత్త్వంలో వుంది. అది తెలినన లౌక్యుడు కనుక, రామప్ప పంతులుకు సంతానం అక్కరలేదనుకొనే తనను మధురవాణి వంటి వేశ్యలతో సంబంధాలెందుకు అని ఎవరైనా ప్రశ్నించే వీలుందని తెలుసు. అలాంటి ప్రశ్నకు 'కామిగాక మోక్షకామి కాడు' అన్న సమాధానాన్ని సిద్ధంచేసి పెట్టుకొన్నాడు.

పితృస్వామిక కుటుంబ వ్యవస్థలో పురుషుడు దాంపత్య సంబంధాలలో వుంటూనే, అంతకు ముందు వ్యవస్థలలో స్త్రీ పురుష సంబంధాల విషయంలో తనకున్న స్వేచ్ఛకు కొనసాగింపు కుటుంబానికి అవతల వేశ్యా సంబంధాలను, కుటుంబం లోపల చాటుమాటు సంబంధాలను ఏర్పరచుకొంటూ, నిర్వహించుకొంటూ వస్తున్నాడు. 'ఒక స్త్రీకి ఒక పురుషుడు', 'ఒక పురుషుడికి ఒక స్త్రీ' అన్న దాంపత్య స్వభావాన్ని స్త్రీ వైపు నుండి ఖచ్చితంగా అమలు చేస్తూ పురుషుడి యథేచ్ఛా సంబంధాలకు అవకాశాన్నివ్వటం పితృస్వామిక కుటుంబ వ్యవస్థ లక్షణమైంది. ఈ లక్షణాన్ని నిరూపించటానికి ప్రతినిధి పాత్రగా రామప్ప పంతులు కనిపిస్తాడు. నియోగ్యప్రభువై ఊళ్ళో వ్యవహారాలన్నీ చక్కబెడుతూనే లుబ్ధావధాన్ల కూతురు మీనాక్షితో చాటు మాటు సంబంధాల వ్యవహారాన్ని నడుపుతుంటాడు. తానే మళ్ళీ పితృస్వామ్య కుటుంబ వ్యవస్థా పరిరక్షకుడిగా మీనాక్షిని తప్పుపడుతూ ఆమెను అదుపు చేయాలని లుబ్ధావధాన్లను హెచ్చరిస్తుంటాడు. మీనాక్షి ప్రవర్తన బాగాలేదని విమర్శించే రామప్ప పంతులుకు గట్టిగా సమాధానం చెప్పినట్లుగా "మీ కంటపడ్డ తరువాత యే ఆడదాని ప్రవర్తన తిన్నగా వుంటుంది" (పు 39) అని అంటుంది. ఈ మాటలవల్ల మధురవాణి కుటుంబంలో వుండే ఆడవాళ్ళను సైతం చెడుదారికి ఈడ్చే పురుషాహంకార వ్యవస్థ యొక్క స్వభావాన్ని సరిగా గుర్తించిందని అర్థమవుతుంది.

రామప్పపంతులు నెలజీతం యిచ్చి మధురవాణిని తన ఇంట తెచ్చిపెట్టు కోవటం కూడా పితృస్వామిక కుటుంబ వ్యవస్థా పరిణామంలో ఒక భాగమైన 'వేశ్యా వ్యవస్థ'ను సూచించటానికీ నాటకేతివృత్తంలో ప్రధానాంశంగా ప్రవేశిం చింది. తన శరీరాన్ని అమ్ముకొని బ్రతికే వేశ్యకు కూడా స్వేచ్ఛ వుండటాన్ని సహించలేని లక్షణం ఈ వ్యవస్థలో వుంది. అందువల్లనే రామప్పపంతులు మధుర వాణి కూడా సంసార స్త్రీ లాగా తనకు బద్ధురాలై వుండా లనుకొంటాడు. మధుర వాణిని ఎప్పుడూ అనుమాన దృష్టితో చూస్తుంటాడు. "సంసారికన్నా మర్యాదగా వుంది" (పు 48) అని ఆమె నెవరైనా మెచ్చుకొంటే అతని అహం తృప్తి పడు తుంది. "వేశ్య అయినా చాలా తెలిసిన మనిషి. మన సంసార్లకి దానికి వున్న బుద్ధి వుంటే బతికిపోదుం" (పు 87) అని లుబ్ధావధాన్లు అంటే అంగీకరిస్తూనే "పరాయి వాళ్ళతో మాట్లాడితేగానీ దానికి తోచదు" అని దిగులు పడతాడు. 'మధురవాణి మా దొడ్డ మనిషి' (పు 104) అని పూళ్ళోవాళ్ళచేత అనిపించుకొని తృప్తి పడు తుంటాడు.

భార్యలను, ఎదిగిన కూతుళ్ళను అనుక్షణం అనుమానిస్తూ పరస్పర విశ్వాసా నికి అవకాశంలేని దాంపత్య సంబంధాలను, ప్రేమాభిమానాలు లేని కుటుంబ సంబం ధాలను కేంద్రంగా చేసుకొన్న పితృస్వామిక వ్యవస్థను నిర్మించుకొన్న పురుషుడు తాను కట్టుకొన్న గూడులో తానే చిక్కుకొన్న సాలెపురుగులా అందులో జీవిస్తూ, అసంపూర్ణ అసంతృప్త జీవితాన్ని గడపటం అనివార్యమవుతుంది. రామప్ప పంతులు, లుబ్ధావధానులు మొదలైన వాళ్ళ జీవితాలద్వారా, మాటలద్వారా భూస్వామ్య కుటుంబ వ్యవస్థా స్వభావాన్ని నిరూపించిన గురజాడ, గిరీశం ఆలోచనల ద్వారా కుటుంబ వ్యవస్థ గురించిన భావజాలంలో వస్తున్న పరిణామాన్ని మన దృష్టికి తీసుకు వస్తాడు.

గిరీశం అసలు కుటుంబ సంబంధాలలో వున్నట్లే కనబడడు. లుబ్ధావధాన్లు అతనికి పెత్తల్లి కొడుకేగానీ అసలు గిరీశం తల్లిదండ్రులు తదితర కుటుంబ వివరా లేవీ ఈ నాటకేతివృత్తంలో ప్రస్తావనకురావు. వారసత్వపు ఆస్తులు లేకగానీ, కోల్పోయిగానీ తమ బ్రతుకుతెరువులు తాము వెతుక్కొంటూ పట్టణాలు చేరిన కొద్ది పాటి చదువున్న యువతరానికి ప్రతినిధి గిరీశం. అతనికి కుటుంబాన్ని గురించిన కాల్పనిక ఆలోచనలు చాలా వున్నాయి. అతని భావనలో కుటుంబం అంటే భార్య, మంచి సంపాదనగల ఉద్యోగం, చక్కటి మేడ, ఆ మేడచుట్టూ తోట, జరీదుస్తులు వేసుకొని నగలు పెట్టుకొన్న అందమైన ఆరోగ్యమైన పిల్లలు, ఆ పిల్లలకోసం బళ్ళుకొనటం- ఇవన్నీ (పు. 65, 66, 67) నగరీకరణక్రమం కుటుంబ వ్యవస్థా భావనలో తెచ్చిన పరిణామ మిది. పెట్టుబడిదారీ వ్యవస్థ తెచ్చిపెట్టిన వస్తు సంస్కృతి

తలకెక్కిన లక్షణంవల్లనే ఉద్యోగం, ఇల్లూ వాకిలి, తోటా దొడ్డీ, నగలూ, దుస్తులూ వీటిపట్ల వ్యామోహం పెరుగుతుంది. ఉద్యోగ వ్యవస్థలో భాగమైన వాళ్ళు కుటుంబాన్ని గురించి ఇలాంటి భావ చిత్రాలు సృష్టించుకొని ఆ కలలన్నింటిని తమ సంపాదనతో సమకూర్చుకోలేక అసంతృప్తికి లోనవుతుంటారు. వాటిల్లో కొన్నింటినైనా సమకూర్చుకోవటం కోసం పెళ్ళాడబోయే పిల్ల వైపు నుండి వచ్చే ధన ప్రయోజనాలను బేరీజు వేసుకొంటారు.

బ్యూటిఫుల్ యంగ్ విడో అయిన బుచ్చమ్మ చక్కదనం, సొంపు తనను ఆకట్టుకోగా గిరీశం ఆమెను ఆకర్షించటానికి పాతరాస్త్రాలు పనికిరావని కొత్తదారి తొక్కాలని అనుకొంటాడు. 'యేవిటంటూ అది?' అని తనను తాను ప్రశ్నించుకొని 'మాయోపాయం చేసి దీన్ని లేవతీసుకుపోయి విడో మారియేజి చేసుకుంటినట్టాయినా కీర్తి, సుఖం కూడా దక్కుతాయ'న్న నిర్ధారణకు వస్తాడు. (పు.53) ఆ క్రమంలోనే బుచ్చమ్మను పెళ్ళాడాలన్న ఆలోచన రాగానే గిరీశానికి ఆమెను పెళ్లాడటం వల్ల విడో మారేజి సభవారు నెలకు యిచ్చే 'నూట్రూపాయలు' గుర్తుకు వచ్చాయి (పు 65). కుటుంబంలోకి భార్యగా వచ్చే స్త్రీ నుండి అనుభవం, ధనం- రెండూ రావాలనుకోవటం వస్తు సంస్కృతికి పరాకాష్ఠ లక్షణం. ఇక్కడ భార్యగా స్త్రీ పురుషుడికి సుఖాన్ని యిచ్చే వస్తువు కావటమే కాకుండా పురుషుడి సుఖమయమైన విలాసవంతమైన విశ్రాంత జీవితానికి డబ్బును సమకూర్చాల్సిన సాధనం కూడా అవుతున్నది. ఆ క్రమంలోనే వరకట్నాల రేట్లు వరకట్నపు హత్యల, ఆత్మహత్యల సంఖ్య రోజు రోజుకా అధికమవుతున్నాయి. ఈ వస్తు సంస్కృతిని బీజ రూపంలో గిరీశంలో చూపించాడు గురజాడ. ధనస్వామ్య సంస్కృతిలో కుటుంబం గురించిన భావనలన్నీ గిరీశం నోట మాటల ద్వారా చెప్పించి ముందు తరం యువకులంతా రాబోయే గిరీశాలేనని హెచ్చరిక చేశాడు గురజాడ.

మొత్తంమీద కన్యాశుల్కం నాటకం, కుటుంబ వ్యవస్థ స్త్రీల జీవితాన్ని నియంత్రించే అధికార వ్యవస్థగా వున్న స్థితిని సూచిస్తోంది. ఇది కన్యాశుల్కం నాటక వస్తు ప్రత్యేకత మాత్రమేకాదు. అనాటి సామాజిక పరిస్థితి అది. ఈనాటికి కొనసాగివస్తున్న దురవస్థ అది. అయితే బ్రిటిషు వలస పాలనలో ఇంగ్లీషు విద్య ద్వారా ఉదార భావాలు వ్యాపించి స్త్రీలను మానవ వ్యక్తులుగా గుర్తించి తరతరాలుగా వాళ్ళకు అందుబాటులోకి రాకుండా పోయిన అవకాశాలను చేరువ చెయ్యాలన్న సంకల్పంతో సంస్కరణోద్యమాలు రూపుదిద్దుకొన్నాయి. దానితో ఇంతవరకు కుటుంబ వ్యవహారాలుగా వున్నవి, సాగుతూ వస్తున్నవి ఇక ముందా స్వరూపంతో వుండలేవని స్పష్టమైంది. ఇంతకుముందు పెళ్ళి అనేది కుటుంబ వ్యవహారం. కన్నబిడ్డను ఈడు జోడైన వాడికిచ్చినా, ముసలవాడికి ముతకవాడికి ఇచ్చినా అదంతా కేవలం

తల్లిదండ్రుల నెనరూ న్యాయం మీద ఆధారపడి సాగుతున్న వ్యక్తిగత వ్యవహారం. ముసలి భర్తలు మరణించి వితంతువులై స్త్రీలు మట్టిళ్లు చేరితే అది వారి 'ప్రాలబ్ధం'. రాసిన రాతను ఎవడూ తప్పించలేడన్న కర్మ సిద్ధాంతం చాటున ఆ స్త్రీలను ఎడతెగని ఇంటి చాకిరికి కట్టిపడేయటం దాని సహజ పరిణామం. తమకు శరీరాలు, హృదయాలు వున్నాయన్న స్పృహనే కోల్పోయి, జీవచ్ఛవాలుగా నాలుగు గోడల మధ్య బతికెయ్యటం వాళ్ళకు అనివార్యం. ఈ దుర్భర పరిస్థితుల నుండి స్త్రీలను ఉద్ధరించటానికి వితంతువులు మళ్ళీ పెళ్ళి చేసుకోవచ్చునని సిద్ధాంతాలు చేసి, అందుకు అంగీకరించని సాంప్రదాయక కుటుంబ చట్రం నుండి వాళ్ళను బయటకు తీసుకువచ్చి పెళ్ళిళ్ళు చేసే నైతిక బాధ్యతతో 'స్త్రీ పునర్వివాహ సమాజాలు' ఏర్పడి పనిచేయటం ప్రారంభించాక, కుటుంబ చట్రంలో వితంతు స్త్రీల చాటుమాటు వ్యవహారాలు, గర్భస్రావాల దాకా వస్తే కేసు రాకుండా చూసేందుకు వంశప్రతిష్ఠ, కుటుంబ గౌరవం అంటూ వెంపర్లాడే ఆ కుటుంబ పెద్దల నుండి లంచాలు తీసుకోవటం ద్వారా చేతులు తడుపుకొని బాగుపడే పోలీసు వర్గాలు కూడా వెధవలు పెళ్ళి చేసుకోవడమే ఉత్తమం (పు 142) అనుకొనే స్థితికి వెళ్లక ఇక 'పెళ్ళి' అనేది సామాజికాంశమే అవుతుంది కానీ ఏ ఒక్కళ్ళ గృహకృత్యంగానో ఉండటం అసాధ్యమై పోతుంది. బాధితులైన స్త్రీల పట్ల మాట్లాడే సామాజిక నిబద్ధత పెరిగేకొద్దీ పెళ్ళికానీ, కుటుంబంలో స్త్రీల పట్ల పురుషుల వైఖరిగాని, ఇదివరకులాగా వ్యక్తిగత సమస్యలుగా వదిలెయ్యటానికి వీల్లేనివి అవుతాయి.

సమాజంలో వేగంగా వస్తున్న ఈ మార్పును గుర్తించ నిరాకరించాడు అగ్నిహోత్రావధాన్లు. అందువల్లనే "రెండో పిల్లకి తగిన వరుణ్ని చూచి పెళ్ళిచెయ్యండి" అని సౌజన్యారావు పంతులు సలహా ఇచ్చినప్పుడు "మీ గృహకృత్యాల జోలికి నేనొచ్చానా యేవిటి? నా గృహకృత్యాల జోలి మీకెందుకూ?" (పు. 184) అని ఆయన మాట తిరగ్గొట్టాడు. వితంతువుల మఠం చేరిన పెద్దపిల్ల బుచ్చెమ్మకు "ఆమె తాలూకా ఆస్తి పంపించి వెయ్యవలసింది"గా స్త్రీ పునర్వివాహ సభ కార్యాధ్యక్షులైన రామయ్య పంతులుగారు తన పేర వ్రాశారని సౌజన్యారావు పంతులు చెప్పినప్పుడు కూడా, అగ్నిహోత్రావధానులు "యేవిటీ ముండా యేడుపు సంత! వాడెవడు? వీడెవడు? మీరెవరు? అదెవర్తె? (పు. 185)" అంటూ ఎగిరి పడ్డాడు. తన ప్రమేయం లేకుండా బుచ్చెమ్మను పెళ్ళాడతానని తీసుకు వెళ్ళిన గిరీశం మీద, పునర్వివాహం జరిపిస్తానని విద్యాబుద్ధులు చెప్పించటం కోసం ఆమెకు అయ్యే ఖర్చుల నిమిత్తం ఆమె తాలూకా ఆస్తి ఆమెకు దఖలు పరచమన్న పునర్వివాహ సభ కార్యాధ్యక్షుని

మీద, పిల్ల బాగు కోరి ఆమె ఆస్తి ఆమెకు పంపమని సలహా యిచ్చిన సౌజన్యా రావు పంతులు మీద, అసలు తన అధికార పరిధిని దాటి వెళ్ళిన కూతురు బుచ్చమ్మ మీద తన వ్యతిరేకతను అంత మొరటుగా ప్రకటించాడు. "వైధవ్యం అనుభవించిన వాళ్ళంతా పూర్వకాలంలో యెంత ప్రతిష్ఠగా బ్రతికారు కారు" (పు. 185) అని గతాన్ని తలచుకొని ఆనందించిన అగ్నిహోత్రావధానులు 'ప్రాలబ్ధం' చాలక వైధవ్యం వచ్చిందని, రాసిన రాత యెవడూ తప్పించలేడని సరిపెట్టకోక బుచ్చమ్మ లాంటి వాళ్ళు తెగబడి ఇల్లు దాటి పోవటానికి 'యీ వెధవ ఇంగ్లీషు చదువులే' కారణమవుతున్నాయని నిరసనగా మాట్లాడతాడు. ఇకపోతే లుబ్ధావధాన్లు అగ్నిహోత్రుని వలె శుద్ధ మూర్ఖుడు కాదు. కనుకనే కాస్త ఆలస్యంగానైనా కుటుంబ వ్యవహారం, అందులోనూ స్త్రీల పట్ల కుటుంబ వైఖరి అనేవి వ్యక్తిగత అంశాలు కావని తేల్చేస్తున్న సంస్కరణోద్యమ సారాన్ని, దానిని సమర్థించే బ్రిటీషు వలస పాలనా స్వభావాన్ని అర్థం చేసుకొనే ప్రయత్నం ప్రారంభించాడు. సౌజన్యారావు పంతులు ఉద్బోధ అందుకు ప్రేరణ అయింది. తాను 'అభాగ్యురాలైన ఆడపిల్ల తండ్రి'నన్న స్పృహ కలగటం కూడా అందుకు కారణమై వుంటుంది.

సంస్కరణోద్యమం అభ్యుదయకర ఉద్యమమే అయినా, ఆడపిల్లల మీద కుటుంబం యొక్క అధికార దౌర్జన్యాలను ప్రశ్నించినా, నిరసించినా అది స్త్రీల స్వంత చైతన్యంతో అభివృద్ధి చెందింది కాదు. స్త్రీల సమస్యకు, స్త్రీల జీవితాన్ని స్త్రీల దృక్పథంతో చూచి నిర్మించిన ఆచరణ ప్రణాళిక దానికి లేదు. వితంతువులు మళ్ళీ పెళ్ళి చేసుకోవచ్చని సిద్ధాంతీకరించినా, వాళ్ళకు వరుళ్ళను నిర్ణయించి పెళ్ళిళ్ళు చేయటంలో, వాళ్ళ జీవితాలను నిర్దేశించటంలో సంస్కరణవాదులది ప్రధానంగా పితృవాత్సల్య దృష్టే కానీ, వ్యక్తులుగా వాళ్ళను గుర్తించిన దృష్టి కాదు. వేశ్యా వ్యతిరేక ఉద్యమం ప్రారంభించినా, సమాజాన్ని వాళ్ళు కలుషితం చేస్తున్నారన్న దృష్టితో పురుషులను వాళ్ళకు దూరంగా వుండమని ప్రబోధించటమే ప్రధానంగా జరిగింది కానీ, వేశ్యను సుఖదుఃఖాలతో కూడిన జీవితాన్ని జీవిస్తున్న మనిషిగా గుర్తించటం జరగలేదు. సంస్కరణోద్యమంలోని ఈ వెలితిని సమకాలంలోనే గుర్తించిన గురజాడ, స్త్రీలు స్వంత ఇష్టంతో దాంపత్య సంబంధాలలోకి ప్రవేశించినప్పుడే కుటుంబ వ్యవస్థ బాగుపడటానికి అవకాశం వుంటుందని అర్థంచేసుకొన్నాడు. పెళ్ళి చేసుకోవటం గానీ, మానటం గానీ స్త్రీల స్వంత నిర్ణయంపై ఆధారపడి జరిగినప్పుడు మాత్రమే అంతవరకు 'చెప్పనలవి కాని కన్నీటి గాథలకు కారణం' (21 మే, 1909 నాడు ఒంగోలు మునిసుబ్రహ్మణ్యానికి వ్రాసిన లేఖ,

లేఖలు (5) 1958, పు. 83) అవుతున్న వైవాహిక వ్యవస్థ ఉత్తమ మానవీయ సంబంధాలను నిర్మించుకో గలుగుతుందన్నది గురజాడ పూర్ణ విశ్వాసం. బుచ్చమ్మను గురించి సౌజన్యారావు పంతులుచేత "ఆమె చదువుకుని, ప్రాజ్ఞురాలై తన యిష్టము వచ్చిన వారిని పెళ్ళి చేసుకుంటారు. లేకుంటే మానుతారు" (పు. 226) అని నాటకాంతంలో చెప్పించిన గురజాడ ఈ విశ్వాసాన్నే ప్రతిధ్వనింప చేశాడు. అంతటితో ఆగలేదు. తన ఊహలో మెదిలే ఉన్నత కుటుంబ వ్యవస్థను ఒక రేఖా చిత్రంగా కన్యాశుల్కం నాటకంలో ప్రదర్శింప చేస్తాడు.

తానూహించిన ఉత్తమ కుటుంబాన్ని, ఆదర్శ కుటుంబాన్ని గురించి చెప్పటానికి గురజాడ కుటుంబ వ్యవస్థా చట్రానికి అవతల వున్న మధురవాణిని ఉపయోగించుకొన్నాడు. దాంపత్యమంటే స్త్రీ పురుషుల సహజీవన శ్రమ సౌందర్యమన్న ఉదాత్త భావనకు మధురవాణి మాటలలో రూపు కట్టించి చూపుతాడు గురజాడ. వేశ్యగా మధురవాణి ఎంత గొప్పదో, కరటక శాస్త్రి ప్రస్తావించిన సందర్భంలో ఆమె వేశ్యా వృత్తిపట్ల వైముఖ్యం చూపి, పెళ్ళి చేసుకొని దాంపత్య సంబంధాలలోకి ప్రవేశించటం ద్వారా మానవీయ విలువలతో కూడిన కుటుంబాన్ని నిర్మించుకోవటం పట్ల ఆసక్తి కనబరుస్తుంది. "కాపు మనిషినై పుట్టి మొగుడి పొలంలో వంగ మొక్కలకు, మిరప మొక్కలకూ దోహదం చేస్తే యావజ్జీవం కాపాడే తన వాళ్ళన్నవారు వుందురేమో" అని మధురవాణి అన్న మాటలు దాంపత్య సంబంధం కేవలం పిత్రార్జితాన్ని వారసత్వంగా యివ్వటానికో, పరానికి ఇన్ని నీళ్ళ చుక్కలు వదలటానికో అవసరమైప సంతానం కోసమైన సంబంధం మాత్రమే కాదని, స్త్రీ పురుషుల మధ్య యావజ్జీవ స్నేహ సంబంధాన్ని నెలకొల్పాల్సిన సంబంధమని సూచిస్తాయి.

అంతేకాదు. వ్యక్తిగత ఆస్తి లేకుండా ఇద్దరూ కలిసి శ్రమ చేసుకొనే స్థితిలో వుండే స్త్రీ పురుషుల మధ్య శ్రమతో ముడిపడి అభివృద్ధి చెందే సంబంధాలు మాత్రమే ఆదర్శ కుటుంబ నిర్మాణానికి ప్రాతిపదికలుగా పని చేయగలుగుతాయన్న ప్రాపంచిక దృక్పథాన్ని కూడా ఈ మాటలు ధ్వనింప చేస్తున్నాయి.

"ఆధునిక మహిళలు మానవ చరిత్రను తిరిగి రచిస్తారు" అన్న ఆశావహమైన దృష్టి గల గురజాడ అప్పారావు, మహిళలను కుటుంబంలో తాము కోల్పోయిన సమస్థాయి సంబంధాలను తిరిగి పొందటానికి, ఉదాత్త మానవ సంబంధాలను పునర్నిర్మించుకోవటానికి వీలుగా సన్నద్ధులను చేయటానికి నాయకత్వ లక్షణాలతో మధురవాణిని చైతన్యవంతమైన మానవ వ్యక్తిగా మలిచాడు. అదింకా ఫలించవలసిన ఆశయమే.



# పిడికిలెత్తిన కవితాగానం
# ట్రేసీ చాప్‌మన్

**అనుసృజన — ఎ. ఎన్.**

దక్షిణాఫ్రికా ప్రజలపై తెల్ల తలారీల దురహంకారాన్ని నిరసిస్తూ విశవి వ్యాప్తంగా నిరసన వెల్లువ వెల్లువెత్తుతూంది. ఈ జాతి వివక్షతా వ్యతిరేక పోరా టంలో సాహిత్యకారులు కూడా ముందు పీటీన నిలబడి పోరాడుతూండడం యాదృచ్ఛికం కాదు. బెంజమిన్ మొలైస్ యిందుకు ప్రబలోదాహరణ.

దక్షిణాఫ్రికాలో పేద గుడిసెల్లో పుట్టి మండేలా పోరాట స్ఫూర్తితో తన గళం విప్పిన విప్లవ గాయని ట్రేసీ చాప్‌మన్. తన గానానికి కవనం కూడా చేసుకొనే ట్రేసీ తన 'క్రాస్‌రోడ్స్' ఆల్బమ్స్‌ని ఎ.ఎన్.సి. నాయకుడు నెల్సన్ మండేలాకు అంకితమిచ్చింది. ఆమె కవితలో పదునైన వాదరే గాదు, గళంలో చంద్రనిప్పులు చెరగగలదని ఆమె గానం అనుభవించిన వాళ్ళంటారు. ప్రపంచ వ్యాప్తంగా జాతి వివక్షత మీదా, తెల్లవారి మధ్యయుగ ఆటవిక ప్రవృత్తి మీద నిరసన వెల్లువలో భాగంగానే ఈ ట్రేసీ కవితలు.

## క్రాస్‌రోడ్లు

నా జీవితం మీ స్వంత మనుకుంటారు
ఏ బలిదానం లేకుండానే,
రాక్షసులు నా మీద విచారణకు వుసిగొల్పుతారు
అవును, నేను నరకపు క్రాస్ రోడ్లలో నిలబడివున్నాను
ఆశతో కుడి, ఎడమల దృష్టి సారిస్తే,
అన్ని వైపులా నన్ను కబలించేందుకు ముందుకొచ్చే రక్కసి చేతులే !
నాకు వెలకట్టామని మీరంతా తలపోస్తారు
నన్నమ్ముకోవాలని శాసిస్తారు
అంతా నశించిన తర్వాత
పాపిష్టి డబ్బే రాజ్యమేలుతుందని మీ ఆశ
వెళ్ళండి, మీ ఆత్మనమ్ముకుని మీ కలుగులో నిక్షేపంగా బ్రతకండి !
నాలోని ఆత్మని సజీవంగా వుంచేందుకే ఈ పోరాటం
నా నవనాడులా రాపాడుతున్నది ఆ హేతువు కోసమే
కొందరంటారు భూతాలు దురవగాహమైన శక్తులని

నేనంటాను, నడిచే మనిషే ఒక పెనుభూతమనీ
వాడో మూర్ఖుడు, అబద్ధాలకోరు, దోపిడీదారు
నీకేది యిష్టమైతే అది మెత్తగా వల్లిస్తాడు
నీకేది కావాలంటే అది ఆశ జూపుతాడు
నువ్వు కూడలి వద్ద నిలబడి వుండగానే
ఆ రోడ్డు నిన్ను దాటుకొని వెళ్ళిపోతుంది
వెనుక ఏముందో
ఏ దారి వైపు తిరగాలో
తొలిసారి నిన్ను గుర్తించడాని కెవరొస్తారో
నిర్ణయించేది భూతాలే! అవే నీ దేవుళ్ళు!
మీరంతా నా జీవితం నడుపుతా మనుకుంటారు
నా జీవితమే నాదని ప్రచారం చేస్తారు
నేను మొక్కవోని దీక్షతో అరుస్తాను చావండని
నా ఆత్మను కాపాడుకోగలనని
నన్ను కాపాడు కుంటానని

## వంతెనలు

వంతెనలన్నీ నువ్వు కాల్చి బూది చేసినా
ఏదో ఒక రోజు నిన్ను వెంటాడుతాయి
ఆ రోజు నీకు తెలిసి వస్తుంది నువ్వు నడుస్తున్నట్లు
ఒంటరిగా
బేబీ! నిన్ను గాయపరిచారని దిగులు పడద్దు
కొన్నిసార్లు సదుద్దేశాలుండి కూడా
పనులు సరైన రీతిలో జరగవు
అయితే ఆ భూతాలన్నీ గుర్తించి
నా గతంలోలాగా నన్ను స్వంతం చేసుకోవాలనుకుంటాయి
కలల్లోనూ, చీకటి మలుపుల్లోనూ చుట్టు ముడుతుంటాయి
నేను అరచి గీపెట్టేంత వరకు
అరిచేంత వరకూ
ఈసారి నన్ను సరిచేసుకుని నిజాయితీగా నించోవాలి
ఈసారి నావంతు వచ్చింది బాకీ తీర్చుకోవాలి
ఈసారి నేనెలా అనుభూతి చెందానో నీకు చెప్పనీ
ఈసారి సరైన నిర్ణయం తీసుకొనే యత్నం తప్పక చేయాలి

వాళ్ళంతా ఒంటరైతే మాత్రమేం
నువ్వు మాత్రం
అవతల నడుస్తావు
పనులన్నీ సరిగ్గా జరిగేలా యోచిస్తూ
సమయమంతా గడుపు
ప్రేమానుభూతి వాస్తవమైతే
నువ్వు దానికోసమే పెనుగులాడాలి
పట్టు వదలకుండా కొనసాగాలి
బేబీ! ఎవరెన్ని చెప్పినా
కొంత సమయాన్ని ఆ విషయమ్మీద కేటాయించాలి
నా మాటలు హాయించుకోడానికి సమయం కేటాయించాల్సిందే
నీ జీవితం గురించి యోచించడానికైనా కాస్త సమయం మిగుల్చుకోవాలి
దూరంగా విసిరివేయబడక ముందే నీ గురించి యోచించే
సమయం దాచుకోక తప్పదు మరి.
ఇక్కడ కూర్చుని ఎదురుచూచే
తీరిక నాకు సుతరామూ లేదు
కావాలంటే నీ కోసం
ఎదురుచూచే సత్తాను మాత్రం మిగుల్చుకుంటాను.

## స్వాతంత్ర్యం!

అతన్ని జైల్లో త్రోసి
అక్కడే పడేసి వుంచారు
ఆ పటుతర శరీరమూ, ఉత్తేజపు టూపిరీ అలా వృథా కావాలని
మెదడు మైనపు ముద్దవ్వాలని
ఎప్పటికైనా చావకపోడా అనే పేరాశతో—
అవును, రోజూ ఓ మూర్ఖుడు పుడతాడు
పాలించడానికే పుట్టాననుకుంటాడు
రేపు నాదంటాడు
ఒకరోజు లేచి చూస్తే యింకేముంది,
జైలు తలుపులు తెరవబడి, సంకెళ్ళు తెగిపడి
వీధుల్లో అలజడి
ప్రతి ఒకరూ గానం చేస్తారు స్వేచ్ఛా గీతం

ప్రతి ఒకరూ గానం చేస్తారు స్వేచ్ఛా గీతం
అతన్ని జైల్లో తోసి
అక్కడే పడేసి వుంచారు
అతని జ్ఞాపకాలు మాసిపోవాలనీ
ఆ వజ్రసన్నిభ పోరాట జీవితం
తమ జీవితాలకు ఎక్కడ అన్వయించుకొంటారోనని
వాళ్ళ భయం !
అవును, రోజూ ఓ మానవాకృతి పుడతాడు
అర్థంకానిదల్లా ద్వేషిస్తాడు
జవాబునల్లా ధ్వంసించాలనుకుంటాడు
తను చేసిందల్లా భగవత్సంకల్పమని మురిసిపోతాడు
తను స్వేచ్ఛగా వున్నానని
స్వేచ్ఛగా యోచిస్తున్నానని
స్వేచ్ఛే జీవితమని కలగంటాడు.
త్వరలోనే వస్తుందా రోజు
బాధితులంతా ఒక దిశగా నడచి
పీడితులంతా స్వేచ్ఛ బడసి
జనమంతా శాంతిగా జీవించే రోజు
అతన్ని విడుదల చేసి
మీ ఆత్మను విముక్తి చేసి ఆలోచించండి
తప్పేదో ఒప్పేదో స్వేచ్ఛగా!
ఎంత అధముడికైనా తనదైన ఓ రోజొస్తుంది మరి.
మనమంతా స్వేచ్ఛగా బ్రతకాలి
స్వేచ్ఛ ననుభవించాలి.
శరీరాలకూ మస్తిష్కాలకూ
మన మలినమైన మనస్సులకూ స్వాతంత్ర్యం
ప్రతి ఒక్కరికీ
యిప్పుడే యిక్కడే!
లేవండి స్వాతంత్ర్య గీతం పాడండి
ఒక్కుమ్మడిగా
స్వాతంత్ర్యం సమభావం ఒక్కటిగా !

(నెల్సన్ మండేలాకు అంకితం)

# ఆ నవ్వుకి అర్థం ఏమిటి?

## దివి కుమార్

వేగంగా వచ్చిన జీపు ఇంటిముందు సడెన్‌గా ఆగింది. ఐదుగురు వ్యక్తులు బయటకు దూకి ఇంటిలోపల సామానులను చిందర వందర చేస్తున్నారు. చేతుల్లో వున్న ఇనప రాడ్లతో పచ్చడి పచ్చడి చేస్తున్నారు, పచ్చడి జాడీలతో సహా! చేతి కందిన సామానల్లా విసిరి కొడుతున్నారు. పరుపుల్లో దూది లాగేస్తున్నారు. గోడ కున్న గాంధీ పటంతో సహా పడగొట్టేశారు. పుస్తకాలను విసిరిసిరి కొడుతున్నారు. వాళ్ళకు అడ్డం వచ్చినదేదీ, కంటికి కనిపించినదేదీ ఆగటంలేదు. అరక్షణంలో ఇల్లంతా భీభత్సమై పోయింది.

ఊరంతా ఇంటి ముందు పోగయ్యారు. ఒకరిద్దరు దుండగుల నడ్డుకోడానికా అన్నట్లు లోపలికి రావటానికి ప్రయత్నించి గుమ్మం దగ్గర అడ్డుగా నిలబడ్డ సైంధవుడి బెదిరింపులకు వెనక్కి తగ్గారు. ఊరి ప్రజల మొహాల్లో ఏదో అర్థంకాని ప్రశ్న. విపరీత ఆందోళన.

ఇంట్లో తల్లి లాంటి పెద్దావిడ. ఈడొచ్చి వస్తున్న ముగ్గురాడపిల్లలు. భయంతో వణికిపోతున్నారు. విధ్వంసకుల క్రౌర్యానికి తుఫాను ముందు తీగలాగా, డేగ ముందు పావురాల్లాగా అలసిన గుండెలతో, నిస్సహాయమైన చూపులతో - కళ్ళముందు తమ అందమైన యిల్లు, సామాన్లు గుల్లయిపోతుంటే, భయాందోళనతో గువ్వల్లా ముడుచుకుపోయి మూలన కూర్చున్నారు.

విధ్వంసకుల ఆకారాలు వికారంగా లేవుగానీ, చూపులూ, చేష్టలూ మాత్రం కరుకుగా, కసాయిగా వున్నాయి. వాళ్ళ పర్సనాలిటీలు మాత్రం కనీసపు కొలతలకు మించి వున్నాయి. వాళ్ళల్లో వాళ్ళు ఒకసారి చూసుకున్నారు. తమ డ్యూటీ అయిపోయిందన్నట్టు ఒక్కసారిగా, వచ్చినంత వేగంగా వెళ్ళిపోయారు.

ఊరు ఊరంతా బిక్కచచ్చిపోయి వుంది జనమందరూ అవాక్కయి నిలబడ్డారు. ఇంతలో దూరం నుండి వస్తున్న రిక్షాలో ఒక తండ్రీ, పాతికేళ్ళ కూతురూ, ఆ కూతురు వొడిలో చిన్న పిల్లవాడూ - ఈ ప్రపంచపు బాధలూ, భయాలూ, చికాకులూ ఎరగకుండా కేరింతలు కొట్టే పసిబాలుడు.

ఇంటిముందు రిక్షా ఆగింది. స్థాణువులై నిలబడ్డ గ్రామస్తుల వంక ఒకసారి చూసి, ఇంటి లోపలికొచ్చి ఆశ్చర్యచకితులై నిలబడిపోయారు. రెండు గంటల క్రితమే వారిద్దరూ అందంగా అలంకరించుకున్న తమ యింటిని వదిలి బయటకు

వెళ్ళింది. పసివాడికి వంట్లో బాగా లేకపోతే ప్రభుత్వాసుపత్రిలో చూపించడానికి తీసుకు వెళ్ళింది. ఇంతలో ఎంత జరిగింది?

సింధూర వాళ్ళింటికి ఎదురింటివాడూ, తండ్రికి చిన్ననాటి నుండి మిత్రుడూ, ఐన గ్రామ పోస్టుమాస్టరు లోపలికొచ్చి, ఎంతో ఆవేదనతో అన్నాడు,"ఎవరో వచ్చి యిల్లంతా ధ్వంసంచేసి పోయారు. మనం అర్జంటుగా వెళ్ళి పోలీసులకి రిపోర్టివ్వా" లని.

కూతురూ ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. సింధూర

## అంకురం

మనుషులు
అమానవీయంగా బతుకులీడుస్తున్న చోట
ఆత్మవంచనా కళలో
ఆరితేరిన నటులై పోయిన వేళ
మంచితన్నాన్ని వ్యక్తిత్వంతో పెంచించి
మానవత్వాన్ని అడుగడుగునా రంగరించి
చూపుడు వేళ్ళతో మీ సంగతేమిటని ప్రశ్నించి
చస్తూ బతకొద్దని
శాశ్వతంగా బతికుండేలా జీవించమని
నిర్దేశించిన చిత్రం
ఆధునిక వాస్తవిక దృశ్యకావ్యం
నడుస్తున్న చరిత్రకు దర్పణం
రేపటి నిజంవైపు
విస్తరిస్తున్న 'అంకురం'

—దివి కుమార్

మొహంలో "పాపం, ఎంత అమాయకుడు!" అన్నట్టు చిరునవ్వు. దానికి ఆ తండ్రి ప్రతిస్పందన. ఆ చిరునవ్వే పెరిగి పెద్దదై ఇల్లంతా, ఊరంతా వ్యాపిస్తుంది.

ఇంతటి దారుణ విధ్వంసకాండ జరిగితే ఆ తండ్రీ, కూతురూ అలా నవ్వుతా రేమిటి? వాళ్ళకేం పిచ్చి పట్టలేదు కదా!

నిజమే! ఆ తండ్రీ కూతుళ్ళిద్దరినీ అప్పటికే ఒక రకపు పిచ్చివాళ్ళుగా ఇంట్లో తల్లీ, వీధిలో స్నేహితులూ భావిస్తున్నారు. లేకుంటే తమకు ఏ సంబంధమూ లేని ఒక పసిపిల్లవాడికోసం జీవితాన్నీ, కాపురాన్నీ బలి జేసుకుంటారా? దారినపోయే దానయ్య కొడుకుని, ఆ తల్లి మాటల్లో చెప్పాలంటే "కాలికి అంటిన బురదను తీసి నెత్తికి రాసుకుంటారా?"

ఇంతకీ అశుభం, శుభం ఎరగని ఆ పసిపిల్లవాడికీ, ఆంతటి విధ్వంసానికీగల సంబంధం ఏమిటో? కళ్ళెదురుగా ఎంతటి ఘోరాలూ, నేరాలూ జరిగినా చెదరని కొండల్లా కదలని కరెంటు స్తంభాల్లా మారిపోయిన, కరడుగడుతున్న మానవతా ప్రపంచంలో ఆ తండ్రీ కూతుళ్ళ ప్రవర్తన విపరీతంగా, విచిత్రంగా లేదూ!

కేవలం కొద్దిగంటలు ఒకే రైలులో సత్యంతో కలసి ప్రయాణం చేసిన నేరానికి ఎన్ని అనుమానాలూ, అవమానాలూ, బాధలూ, కష్టాలూ సింధూర భరించింది! ఏడుస్తున్న పసివాడిని సముదాయించ లేకపోయాడా తండ్రి. అప్పుడే కాపురానికి వెడుతున్న సింధూర కూడా అదే కంపార్టుమెంట్లో ప్రయాణం చేస్తోంది. స్త్రీ సహజమైన మాతృ హృదయంతో పిల్లవాడిని తీసుకుని సముదాయించింది. పాలుపడితే మంచిదని చెప్పగా, పిల్లవాని తండ్రి రైలు ఆగగానే 'గురజాల' స్టేషన్ ప్లాట్ఫారంపైకి దిగాడు. కొద్దిసేపట్లో బండి బయలుదేరి వేగమందుకుంది. పిల్లవాని పాలకని వెళ్ళిన తండ్రి తిరిగిరాలేదు. ఏమయ్యాడో ఏమో?

పక్కనున్న సంచీ తీసి చూసింది సింధూర. రెండే పుస్తకాలు. 'మాలపల్లి', 'అమ్మ'! సంస్కారవంతులూ, సామాజిక కార్యకర్తలూ చదివే సాహిత్యం అది. పుస్తకం పైఅట్ట తిరగేయగానే "జి. సత్యం" అని పెద్దక్షరాల్లో రాసున్న పేరు. ఎవరో ఏమిటో తెలియదు.

ఇంతకీ పిల్లవాడినేం జేయాలి? సింధూర దిగవలసిన స్టేషన్ వచ్చింది. సామానులతోపాటు కాపురానికొచ్చే భార్య వొడిలో పసిపిల్లవాడు! భర్తకి అనుమానం; ఆశ్చర్యం. తోటి ప్రయాణికులు విషయం చెబుతారు. స్థిమితపడ్డాడు భర్త. అయినా ఎవరో వదిలేసిన పిల్లవాడిని తాము తీసుకెళ్ళటమేమిటి?

ఏ పాపం యెరుగని పసిపిల్లవాడిని గాలికి వదిలేయటం సింధూర కిష్టంలేదు. ఆ సత్యానికి ఏ కష్టం వచ్చిందో సింధూరకు తెలియదు. తన తండ్రి వొక ఉపాధ్యాయుడిగా తనకు నేర్పిన మానవతా ధర్మాన్ని తను ఆచరణలో అనుసరించాలనుకొంది.

ఈ సంఘంలో మానవత్వాన్ని ప్రదర్శించటం అంత తేలిక పనేం కాదు. కాపురానికి రాకముందే వొళ్లో పసిపిల్లవాడేమిటని అవమానించే అత్తగారూ, అనుమానాల్ని పెంచే లోకమూ! యౌవనపు సరదాలకు అడ్డుగా పసివాని ఉనికి భర్తకు చిరాకు తెప్పిస్తుంటుంది.

పిల్లవాని తండ్రి ఏమైనాడో, ఎక్కడున్నాడోనని విచారణకు బయలుదేరగా, ఎదురైన చేదు అనుభవాలు ఏన్నో! సింధూర తన ప్రయత్నం విరమించుకోనందుకు మొదటి శిక్షగా భర్త ఆమెను వదిలి రైలెక్కి వెళ్ళిపోతాడు. పోలీసులు ఆమెను వ్యభి

చారం నేరం కింద యిరికిస్తారు. పిల్లవాడిని రైల్వే ప్లాట్‌ఫారంమీద వదిలేసి భర్తతో వెళ్ళిపోనందుకు భర్త ఆమెను విడిచేసి వెళ్ళిపోతే, పిల్లవాని తండ్రి గురించి విడిచి పెట్టకుండా వాకబు చేసినందుకు శిక్షగా వ్యభిచారం నేరం కింద నమోదయి పత్రికలకు ఎక్కింది.

సింధూర అత్తగారు కూడా ఒక పోలీసే. పిల్లవాడేకులమో, ఏ మతమోనని చిరాకు పడుతూనే, "వాడే కావాల్నంటే తమ గడప తొక్కనక్కర్లే"దని హెచ్చరిక చేస్తుంటుంది. కొడుకుతో విడాకుల నోటీసు గూడా ఇప్పిస్తుంది.

సింధూర తల్లి సమకాలీన సామాజిక నీతి లాంటిది. ఇతరులకు అప కారం చేసే తత్వం ఉన్నట్టు తెలియదుగానీ, 'మనకిబ్బంది కలిగించే పనులు-అవెంత మంచిపైనా, గొప్పపైనా మనకనవసరం' అన్నది ఆమె సూత్రం. నిర్మల మయిన, పెళ్ళయిన మంచిపిల్ల ఎవరో ఎరగని మనుషుల పిల్లవాడి కోసం తన కాపురాన్నే కూల్చివేసుకుంటాననటాన్ని భరించలేదా సమాజపు నీతి.

మానవత్వాన్ని ప్రదర్శించటానికి ఎంతటి పట్టుదలా, త్యాగమూ కావాలి! కుటుంబ జీవనమూ, సంస్కృతీ ఆ ఆలోచననే విరిచే ప్రయత్నం చేస్తున్నాయి. మానవత్వంగా అంకురించి పెరిగే ప్రతి బీజాన్నీ, మొక్కనీ తుంచెయ్యటానికి ఎన్నెన్నో సన్నీలూ, తుపాకులూ కాపలా కాస్తున్నాయి.

తండ్రి చిన్ననాడు బడిలో నేర్పిన పాఠాలూ, ప్రస్తుతం యిస్తున్న ధైర్యమూ ఆమెను ముందడుగే వేయించాయి. ఒక లాయరు సహాయంతో సత్యం కోసం సెర్చి వారంటు తెప్పించింది. నిజాన్ని కప్పిపుచ్చటం కోసం సాక్షులపై పోలీసుల హింసా కాండ. పెళ్ళి చేసుకోడానికి పనికిరాకుండా బ్లాకు టిక్కట్లమ్ముకునే నీలాద్రిపై పోలీసు ట్రీట్‌మెంట్.

"ఇంక సినిమాలు చూడనుసార్! చూసినా కన్నీళ్ళు రావుసార్!" అన్న నీలాద్రి డైలాగ్- మానవత్వాన్ని ఇనపబూట్లతో తొక్కివేస్తున్న నిరంకుశ వ్యవస్థ పలికించేది.

సత్యాన్ని పోలీసులు అరెస్టు చేశారనే నిజాన్ని సింధూర గ్రహించగలిగింది కానీ, ఎక్కడ వున్నాడో పట్టుకోలేకపోయింది. కంచే చేను మేస్తోంది. 'అదే'మని అడిగేవారి కళ్ళల్లో సూదులు గుచ్చుతోంది.

పసివాడికి ఒంట్లో బాగుండకపోతే సింధూరా, తండ్రీ వాడిని ఆసుపత్రికి తీసుకువెళ్ళారు. అప్పటికే ఆసుపత్రిలో సత్యానికి వైద్యం చేయిస్తున్నారు పోలీసులు. చావునుండి బయట పడవేసి మళ్ళీ నెత్తురు కక్కేలా, మూర్ఛవచ్చి పడిపోయేలా,

కాకుంటే ఈలోగా రహస్యాలు విప్పేలా చేద్దామని వారి ప్రయత్నం. ప్రయత్నం విజయవంతమైతే ప్రమోషన్ల ప్రోత్సాహం వారిచేత చురుకుగా పనిచేయిస్తోంది.

ఆసుపత్రి బయట సత్యాన్ని గుంజుకెడుతున్న పోలీసుల్ని చూసిందిసింధూర. తను వెతుకుతున్న తీగ కాలికి తగిలినట్టయింది. ఆందోళనతో బిగ్గరగా కేకేసింది. "సత్యం...." తండ్రితో చెప్పింది- "సత్యాన్ని పోలీసులు గుంజుకెళ్ళి జీపులో వేసుకుపోయా"రని.

సింధూర కాలికి తగిలినది తీగకాదు. తాచుపాము. అందుకే అది కోపంగా, కసిగా "నిజం తెలుసుకుంటారా? ఎన్ని గుండెలు. అయితే అనుభవించండి" అనుకున్నాయి కాటోలు.

మొదట వర్ణించిన విధ్వంసకాండంతా, సింధూరా వాళ్ళు ఆసుపత్రి నుండి యింటికి తిరిగివచ్చేసరికి జరిగిపోయింది.

ఆ తండ్రీ కూతుళ్ళ మనోధైర్యాన్ని కుంగదీయటానికి చేసిన ప్రయత్నంలో బీభత్సం ఒక భాగం. 'మా నిజాలు బజారుపాలు చేసే వాళ్ళందరికీ ఇదే శిక్ష!' అంటూ హెచ్చరిక మరోభాగం.

పాపం! పోస్టుమాస్టరు మామూలు మధ్యతరగతి మనిషి. పోలీసులు చట్టాన్నీ, నీతినీ లాఠీలూ, తుపాకుల రూపంలో ధరించి బతుకుతుంటారని భావించే సాదాజీవి. ప్రజలకు నిజంగా శాంతిభద్రతలు కలిగించటానికే పోలీసు వ్యవస్థ వుందనే భ్రమ ఆయనిది.

సింధూర కూడా బహుశా ఒకప్పుడు అలాగే అనుకునేదేమో! కానీ స్వానుభవంలో పోలీసుల చేతిలో లాఠీ ప్రజలపై హింసగానూ, వాళ్ళ యూనిఫారం అసత్యానికి ప్రతీకగానూ ఆమెకు అర్థమైంది. అంతటా విధ్వంసానికి పాడిగట్టింది ఎవరో కాదు. మారువేషాల్లో వున్న పోలీసులే! ఆ సంగతి ప్రేక్షకుడికి కూడా అర్థమవుతుంటుంది. అర్థంకానిదల్లా పోస్టుమాస్టరులాంటి చదువుకున్న అమాయకులకి.

"వెంటనే మనం పోలీసులకి కంప్లయింట్ యివ్వాలిరా" అని ఆయన అనగానే ప్రేక్షకులందరూ ఒక్కసారిగా నవ్వారు. సింధూరా, ఆమె తండ్రీ ఒకరిని చూసి, ఒకరు నవ్వుకున్నారు. విరగబడి పగలబడి నవ్వుకున్నారు. నిర్లక్ష్యంగా నవ్వుకున్నారు. 'ఈ పోలీసులు యింతకంటే యేమి చేయగలరులే' అని నవ్వుకున్నారు. తమను మానసికంగా కుంగతీద్దామని కర్కశంగా ప్రవర్తించిన వారి క్రౌర్యానికి కించిత్తు కూడా వారు చలించలేదు.

ఓటమిని అంగీకరించని వ్యక్తి ఓడిపోయినట్టు లెక్కకాదు. ఇంకా పోరాడు తూనే ఉన్నాడన్న మాట. పోలీసుల దౌష్ట్యానికి తలవొగ్గి భయపడి, ఓడిపోయిన పిరికివాడిలా వారు పారిపోదల్చుకోలేదు. అందుకే ఓటమిని అంగీకరించకుండా శత్రువుల నీచమైన ఎత్తుగడలను అపహాస్యం చేయడానికి విగ్గరగా నవ్వారు.

పోలీసుల అమానుషత్వానికి లొంగకుండా నిర్లక్ష్యంగా ధ్వనించిన, ప్రతిధ్వనించిన ఆ నవ్వు "అంకురం" చిత్రంద్వారా ఆంధ్రదేశమంతటా విస్తరిస్తోంది.

ఇప్పటికే 'మూడు లాకప్ హత్యలూ, ఆరు ఎన్‌కౌంటర్లు'గా సాగుతున్న జనార్ధనరెడ్డి ప్రభుత్వ పాలనలో, పోలీసు పహరాలో ప్రజలు బతకటానికి అలవాటు పడుతున్న కాలంలో "అంకురం" విడుదల కావటం ఓ చారిత్రక విశేషం. భారత దేశంలో ఏ భాషలోనైనా ఈ చిత్రం విడుదల కావచ్చుగానీ, తెలుగులోనే మొదట విడుదల కావటం అత్యంతవసరమైన, సహజమైన సంఘటన.

పాలు తీసుకురావటానికి రైలు దిగిన సత్యాన్ని పోలీసులు అరెస్టుచేసి గుంజుకు పోయిన సంఘటనను అప్పుడే ప్రేక్షకులకు తెలియనివ్వకుండా, కథా గమన క్రమంలో అర్ధమయేట్టు చేస్తే ఇంకా బాగుండేది. ఉత్కంఠతలో నుండి నిజాన్ని గ్రహించటంవల్ల ప్రేక్షకునిపై బలమైన ముద్రపడటానికి ఆస్కారం వుంటుంది.

("అంకురం....మరొక పార్శ్వం" వచ్చే సంచికలో)

## విజ్ఞప్తి

**ఏజంట్లకు —**

సం॥రాల తరబడి బకాయిలు పేరుకుపోయి, ఎన్ని ఉత్తరాలు రాసినా ఎలాంటి స్పందనా, ప్రయోజనమూ కనబడకపోవడంతో మరొక గత్యంతరం లేనందున ఈ నెలనుంచి మీకు పంపే కాపీలు ఆపివేయవలసి వస్తున్నందుకు మేమెంతో చింతిస్తున్నాం. బకాయిలు పూర్తిగా చెల్లించి, ఏజెన్సీలను పునరుద్ధరించుకోమని—

**చందాదారులకు —**

చందాలు అయిపోయినవారికి ఈ నెల నుంచి పత్రికను పంపడం ఆపివేస్తున్నాము. చందాలను కట్టి పత్రికను తెప్పించుకోవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం—

—సంపాదక వర్గం

# స్వీకారం :

1. శ్రీశ్రీ వ్యాసాలు రివ్యూలు - (శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం : 16) కూర్పు : చలసాని ప్రసాద్, పేజీలు 192, వెల రు. 55. విరసం ప్రచురణ. ప్రతులకు : నవయుగ బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాద్-500195.

2. రాచకొండ విశ్వనాథశాస్త్రి ఋక్కులు, కథలు-ఒక విశ్లేషణ (యం.ఫిల్ కోసం సిద్ధాంత వ్యాసం) మార్క యాదయ్య, పేజీలు : 176, వెల : రు. 20 శివ పబ్లికేషన్స్, వరంగల్. సోల్ డిస్ట్రిబ్యూటర్స్ : నవోదయ బుక్ హౌజ్, ఆర్యసమాజ మందిర్ ఎదురుగా, సుల్తాన్ బజార్, హైదరాబాదు-500 027.

3. భారత దేశంలో కులవ్యవస్థ-భిన్న దృక్పథాలు (సంక్షిప్త పరిశీలన) వేములపల్లి వెంకట్రామయ్య, పేజీలు 176, వెల : రు. 10; ప్రజాపంథా ప్రచురణలు, ప్రతులకు-ఇంటి నెం. 4-13-14, కొరిటపాడు, గుంటూరు-522 007.

4. ఒక వేకువ కోసం....(కా. కృష్ణారెడ్డి, కా. పవన్ కుమార్, కా. మల్లేష్, కా. రవి, కా. కాంతన్నలను స్మరిస్తూ ప్రజల పాటల సంకలనం) వివిధ కవులు. ప్రచురణ : అరుణోదయ (సాంస్కృతిక సంస్థ), పేజీలు 38, వెల : రు. 5-00; ప్రతులకు : విమోచన, నల్లకుంట, హైద్రాబాద్-500 044, మైత్రీ బుక్ హౌస్, ఏలూరు రోడ్డు, మసీదు వీధి, విజయవాడ.

5. చిరునామా (కవితా సంకలనం), ప్రజా రచయితల సమాఖ్య, ఖమ్మం జిల్లా యూనిట్ ప్రచురణ. పేజీలు 52, వెల : రు. 7/- ప్రతులకు : ఎన్. తిర్మల్, టీచర్, వైరా, ఖమ్మం జిల్లా. ప్రతులకు : ప్రగతి బుక్ హౌస్, మైత్రి బుక్ హౌస్, విజయవాడ.

6. ప్రవహించే జ్ఞాపకం (కవితా సంకలనం) యాకూబ్-శిలాలోలిత ప్రచురణ, పేజీలు 82, వెల : 10/- సంపాదకుడు, రమణమూర్తి, ప్రతులకు: రచయిత, తెలుగు లెక్చరర్, అన్వర్ ఉలూమ్ కాలేజీ, మల్లేపల్లి, హైదరాబాదు-1. మరియు విశాలాంధ్ర, నవోదయ, నవయుగ, ప్రగతి.

7. నేల తడవని వాన (ఎంపిక చేసిన కవితలు), ఏలేశ్వర నాగభూషణాచార్య, ప్రచురణ : మంజీర రచయితల సంఘం, మెదక్ జిల్లా, 7-3-18/1 హెడ్ పోస్టాఫీసు పక్కనందు, సిద్దిపేట-502 103.

8. ప్రవాహం (కవితల సంపుటి) దర్భశయనం శ్రీనివాసాచార్య, పేజీలు 60 వెల : రు. 12.00. ప్రతులకు : విశాలాంధ్ర అన్ని బ్రాంచీలలో; నవయుగ బుక్ హౌస్, హైదరాబాదు. నవోదయ బుక్ హౌస్, హైదరాబాదు.

ధారావాహిక వ్యా

సంస్కృతి : ప్రజాసాహితీ సాంస్కృతికోద్యమం

# భూస్వామ్య సంస్కృతి రూపాలు

## వర్ణాశ్రమ ధర్మాలు : కులం

(జూలై 92 సంచిక తరువాయి)

వర్ణము అంటే రూపము, రంగు, గుణము అనే అర్థాలున్నాయి. అంటే మనిషి గుణాన్నిబట్టి అతని వర్ణం నిర్ణయింపబడేదన్న మాట. ప్రజలందరినీ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే వర్ణాలుగా విభజించారు. బ్రాహ్మణులు బ్రహ్మ తలలోంచి పుట్టారని, కనుక మేధో సంబంధమైన పని చేస్తారనీ: క్షత్రియులు బ్రహ్మ భుజాల నుంచి జన్మించారనీ, వీరు శౌర్యాన్నీ, భుజబలాన్నీ ప్రదర్శిస్తారనీ: వైశ్యులు బ్రహ్మ తొడల నుంచి ఉద్భవించారనీ, వీరు వ్యాపారం, వాణిజ్యం చేస్తారనీ, చివరగా శూద్రులు బ్రహ్మ పాదాల నుంచి వచ్చారనీ కనుక వీరు కాయకష్టం చేస్తారనీ ప్రచారంలో వుంది. అదీగాక ఎవరు ఏ వర్ణంలో పుట్టినా, వారి వారి గుణ కర్మలను బట్టి ఆయా వర్ణాలకు చెందవచ్చునని చెప్పినా, ఇది అంతగా ఆచరణలో కన్పడదు. చివరకు అది పుట్టుకతో వచ్చిన వర్ణంగానే మారింది. 'భగవద్గీత'లో శ్రీకృష్ణుడు "గుణ కర్మలపై ఆధారపడి నేనే నాలుగు వర్ణాలను సృష్టించాను" అని ప్రకటించాడు!

ఈ నాలుగు వర్ణాల వారూ చేసే పనులు సమాజానికి ఉపయోగపడేవే. కాని వీటిలో ఉన్నతమైన పనులూ, నీచమైన పనులు అనే తేడా ప్రవేశించడంతో ఈ వర్ణాలలో ఉచ్ఛ, నీచ భావాలు ప్రవేశించాయి. ఎప్పుడైతే పుట్టుక వర్ణాన్ని నిర్ణయించే స్థితికి వచ్చిందో, అప్పుడే వివిధ కులాల పుట్టుకకు అంకురార్పణ జరిగింది. వర్ణ వ్యవస్థలోని అసమానతలు కుల వ్యవస్థలో మరింతగా ప్రతిబింబించాయి. నిజమే! ప్రాచీన భారతంలో ప్రతివర్గమూ ఒక వ్యక్తికి కట్టుబడి వుండటమే, వర్ణ వ్యవస్థలోని మూలతత్వం. వర్గమనేది ప్రధానంగా ప్రాచీన సమాజంలోని శ్రమ విభజనను సూచిస్తుంది. ఈ విధమైన సాంఘిక శ్రమ విభజన ఆసిరియాలోనూ, ఈజిప్టు, చైనా, మధ్యాసియా ప్రాంతానికి చెందిన ప్రాచీన సమాజాల్లోనూ వుండేదని మార్క్స్ చెప్పాడు. (సి. వి. ఆధునిక యుగంలో కులవ్యవస్థ- పేజీ 5, 6)

నాలుగు వర్ణాలూ ఘనీభవించి కులాలుగా పరివర్తన చెందాయి. ఆక్రమంలోనే ప్రతివర్ణంలోనూ వివిధ తెగలూ, ఉపతెగలూ,కులాలూ ఏర్పడ్డాయి. డి. డి. కొశాంబి ఈ విషయమై ఇలా అంటున్నారు- "నాలుగు ప్రధాన 'వర్ణాల' మధ్య వర్ణసంకరం జరిగిన పర్యవసానంగా కులాలు ఏర్పడ్డాయని మనువు కల్పించాడు. మొదట్లో

శూద్రుడుగా పేర్కొన్నవానికీ, తరువాత కూలి నాలి చేసుకునే కులాలన్నిటినీ కలిపి శూద్రులుగా పిలువబడ్డ వాళ్ళకూ మధ్య సంబంధమేలేదు. శ్రమవిభజన అపరిణతంగా వున్నపుడు నాలుగు వర్ణాలే సరిపోయాయి. తరువాత స్థిర వ్యవసాయ గ్రామాల సాంద్రత పెరగడంతో కొత్త పరిణామాలు వచ్చాయి. స్వయంపోషక గ్రామాలకు ఆ చాతుర్వర్ణ్యం సరిపోదు. శూద్రుల సంఖ్య అపరిమితంగా వృద్ధి అయింది. చాతుర్వర్ణ్య వ్యవస్థ చట్రంలోకి కొత్త సమాజాన్ని ఎలా చొప్పించాలో తెలీక బ్రాహ్మణులు తికమక పడిపోయారు. వర్ణవ్యవస్థ స్థానే కులవ్యవస్థ ఏర్పడ్డా కొత్త వ్యవస్థను పాతసూత్రాల పరవడిలోనే నిర్వచించే ప్రయత్నంలో చాతుర్వర్ణ్య విభజనను పట్టుకుని వేలాడుతూనే తామర తుంపరగా వృద్ధి అయిన అసంఖ్యాక కులాలకు అర్థాలు కల్పించారు." (ప్రాచీన భారత చరిత్ర- డి.డి. కొశాంబి. పేజీలు 38, 39 HBT)

'చీల్చి పాలించు' అనే రాజకీయ సూత్రం మనం బ్రిటీషువారికి అన్వయించి చెప్తాం. వీరు మన దేశ ప్రజలను రకరకాలుగా మతం పేరుతో, కులం పేరుతో విభజించి పాలించారు అని చెప్తాం. కానీ నిజానికి బ్రిటీషువారు రాకముందే, ఎన్నో ఏళ్ళ క్రితమే మనం ఈ సూత్రాన్ని వర్ణ కుల వ్యవస్థ రూపం ద్వారా ఉపయోగించుకుంటూ వస్తున్నాం. ప్రజలందర్నీ చిన్న చిన్న గ్రూపులుగా తెగలుగా ఈ సూత్రం విడగొట్టి పారేస్తుంది. కాయకష్టంచేసే అసంఖ్యాకులైన శూద్రులు సంఘటిత పడకుండా కులాలు అడ్డుపడుతూ వుంటాయి.

గుణాలబట్టి వర్ణం నిర్ణయింపబడట మనేది, ఒక సిద్ధాంతంగా బాగానే వుంది కాని ఆచరణలో ఎంతకాలం పాటింపబడిందో చెప్పలేం. ప్రాచీన కాలంలో క్షత్రియుడిగా జన్మించిన విశ్వామిత్రుడు బ్రాహ్మణ వర్ణంలోకి ప్రవేశించడానికి 'బ్రహ్మర్షి' కావడానికి అష్టకష్టాలు పడ్డాడు. కరడుగట్టిన వర్ణ వ్యవస్థపై తిరుగుబాట్లు జరిగాయి. వీటి సమాచారం రామాయణ, భారతాల్లో చూడగలం. ఉదాహరణకు రామాయణంలోని 'శంబుక వధ'. శంబుకుడు వర్ణ వ్యవస్థపై చేసిన తిరుగుబాటును భరించలేక, అయోధ్యలోని బ్రాహ్మణ పురోహితులు రాముడిచేత శంబుకుడ్ని హత మార్చారు. మనువు, పరాశరుడు, నారదుడు, బోధాయనుడు, ఆపస్తంబుడులాంటి 'స్మృతి కర్తలు' తమ తమ స్మృతుల్లో శూద్ర బానిసల తిరుగుబాట్లు గురించి హెచ్చరించారు. 'వర్ణ ధర్మం' ఉల్లంఘించబడి, వర్ణసంకరం జరిగినపుడు చట్టాన్ని అత్యంత కఠినంగా అమలు చేయాలని ఆదేశించారు!

తమ తమ గుణాలబట్టి, చేసే పనులబట్టి వర్ణం ఏర్పడుతుందిగాని, పుట్టుకతో వర్ణం రాదని చెప్పే వాదన అంతా బూటకమేనని, ఇదంతా రుజువు చేస్తోంది. కులాల పుట్టుకకు మూలకారణమైన ఈ వర్ణ విభజన మానవులందరూ సమానమే అన్న సూత్రాన్ని వ్యతిరేకిస్తుంది. ఇది ప్రజా వ్యతిరేకమైన సిద్ధాంతం. ప్రజా వ్యతిరేక సంస్కృతిలో భాగం. (వచ్చే సంచికలో 'కులాలు - కుల నిర్మూలన')

## ప్రపంచ ప్రజలకు తెలుగు సాహిత్యపు కానుక:
# గురజాడ గీతం "దేశభక్తి"

– ఛాయరాజ్

వర్ణ వ్యవస్థా కర్మ సిద్ధాంతాల ప్రాతిపదికపైన ఫ్యూడల్ వర్గ ప్రచార సాధనంగా 18వ శతాబ్దం పూర్వార్థం వరకూ తెలుగు సాహిత్యం బలంగా పనిచేసింది. ఈ కాలంలో తెలుగు సాహిత్యానికి ఒక రూపం ఏర్పడినా, వస్తు రీత్యా ఉన్నత వర్గాలవారికీ, భాష రీత్యా సంస్కృతానికీ చెంది ప్రజా బాహుళ్యావసరాలకు దూరమయ్యింది. ప్రజలను భూస్వామ్యవర్గ భావజాలానికి దాసోహం చేసింది. గురజాడ కాలం వరకూ తెలుగు సాహిత్యంలో ఈ పరిస్థితి కొనసాగింది. గురజాడ కాలానికి కొద్దిగా ముందు నుండి బ్రిటిష్ పాలన మూలంగా భారత సమాజంలోని సాధారణ సంబంధాలలో చిన్న చిన్న మార్పులు సంభవించడంవల్లా, ఆంగ్ల విద్యా వ్యాప్తితో ఇతర దేశ భాషా సాహిత్యాలతో భారత ప్రజలలోని మేధావి వర్గానికి పరిచయం ఏర్పడడంతో వారిలో కొంత శాస్త్రీయ దృక్పథం అలవడింది. ఈ మార్పులవల్ల సాహిత్యంలో సంస్కృత భాషా స్థానం సడలడం, వ్యావహారిక భాషా ప్రయోగానికి ప్రయత్నాలు సాగడం, ప్రజా సమస్యలు కావ్య వస్తువులుగా రూపుదిద్దుకోవడం ప్రారంభమైంది.

---

"నిక్కమైన మంచి నీలమొకటిచాలు, తళుకు బెళుకురాలు తట్టడేల"

---

ఈ ప్రారంభం "కన్యాశుల్కం" రచనతో నూతన తెలుగు భాషా సాహిత్యాలకు యుగారంభమైంది. ప్రజల సమస్య కావ్య వస్తువయ్యింది. వాడుక భాష కావ్య భాషా స్థానాన్ని పొందింది. 1892లో "కన్యాశుల్కం" రచనతో ప్రాచీన తెలుగు సాహిత్యానికి వీడ్కోలు చెప్పాడు గురజాడ.

తెలుగు సాహిత్య రంగంలోని ఎందరో మహాద్రష్టల నుండి సామాజిక పరిస్థితులు గురజాడను ఎంపికచేసి ఆధునిక సాహిత్య ప్రక్రియలకూ వస్తు నిర్దేశకత్వానికీ మార్గదర్శకత్వమివ్వమని ఆతనిని ఆదేశించాయి. గురజాడ ప్రజల భాషను ప్రేమించిన భాషాశాస్త్రవేత్త. ఆతడు ఆధునిక తొలికావ్య రచయిత. గురజాడ కలం నుండే రెండు మహాకావ్యాలు వెలువడ్డాయి. తొలికావ్యం "కన్యాశుల్కం" భారతీయ భాషా సాహిత్య ప్రక్రియలన్నింటికీ మార్గదర్శకత్వం వహిస్తుంది. రెండవ కావ్యం "దేశభక్తి" గీతం ప్రపంచ ప్రజలకు తెలుగు సాహిత్యపు కానుక.

ఈ మహోత్కృష్టమైన కార్య నిర్వహణ కోసం గురజాడ తల్లి గర్భం నుండి తొందరపడి నెలలు నిండక ముందే జన్మించాడు. తన కాలానికంటే ముందుండి తన తర్వాత కాలానికి మార్గదర్శకుడై, భావితరంలో రానున్న త్యాగధనులైన ప్రజా రచయితలకు తన సాహిత్య విశ్వరూప స్థానన్ని ఖాళీ చేసేందుకు తొందరపడి 53వ ఏట భౌతికంగా నిష్క్రమించాడు.

ఆధునిక ప్రపంచ ప్రజలకు "దేశభక్తి" గీతాన్నిచ్చి తెలుగు సాహిత్యానికి మహోన్నత స్థానాన్ని కల్పించిన గురజాడను గౌరవించే బిరుదును ప్రపంచ భాష లన్నింటినీ మథించి రూపొందించాల్సిందే. శ్రీశ్రీ మాటల్లో దేశభక్తి గీత ప్రాశ స్త్యాన్ని తెలుసుకొందాం - "... ....గురజాడ రచనలన్నీ నష్టమైపోయి ఒక్క "దేశభక్తి" గీతం మిగిలినా చాలును-అతడు ప్రపంచ కవులలో ఒక్కడుగా లెక్కించదగిన మహాకవి అని రుజువు కావడానికి. ఎందువల్లనంటే "దేశభక్తి" గీతం సమస్త ప్రపంచ మహాజనుల జాతీయగీతం. రామాయణ భారతాది ఇతిహాసాల కున్న విలువ ఈ ఒక్క గీతానికి ఉందని అంటే కొందరు ఆశ్చర్యం పొందుతా రేమో! కాని ఆశ్చర్యకరమైన యథార్థం ఇది. కాలం గడుస్తున్నకొద్దీ బలం సంత రించుకొనే కొద్దిపాటి మహా కావ్యాలలో ఒకటిగా దీనిని గుర్తించక తప్పదు. ఒక తెలుగు కవి ప్రపంచానికిచ్చిన కవిత్వపు కానుక ఇది. మానవుని ఆధ్యాత్మిక యాత్రలో "భగవద్గీత"కు గల ప్రత్యేక స్థానం ఉంది-గురజాడ కవి "దేశభక్తి" గీతానికి. ఒక కాలానికీ, ఒక స్థలానికీ పరిమితం కాని సందేశం ఇచ్చేదీ ఈ గీతం........"

గురజాడకు ముందు కవులు ఫ్యూడల్ వర్గ ప్రయోజనాలను గౌరవించేందుకు ఆంధ్ర భాషను అభిమానించారు. కానీ గురజాడ సామాన్య ప్రజలను గౌరవించి వాడుక తెలుగు భాషను ప్రేమించాడు. వాడుక భాషను ప్రేమించడమంటే ప్రపంచ ప్రజల భాషలన్నింటినీ గౌరవించడమే. దేశాన్ని ప్రేమించడమంటే ప్రపంచాన్ని ప్రేమించడమని "దేశభక్తి" గీతం ద్వారా చాటి చెప్పాడు.

ఆ కాల ప్రయోజనాల నాశించి అప్పటి ప్రభువులను కీర్తించే జనగణమన జాతీయ గీతం కాదు గురజాడ "దేశభక్తి" గీతం. దేశంలోని మహాజనులను విస్మ రించి ప్రకృతిని ప్రస్తుతించే ఏకజాతీయ గీతం కాదు మన గురజాడ "దేశభక్తి"గీతం. 'వందేమాతరం' అని చేతులు దులుపుకోవడం కాదు, 'దేశమంటే మనుషులోయ్' అని చెయ్యెత్తి జైకొట్టాలి.

"దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్"

ఈ రెండు మాటల్లోంచి పెళ్ళుబికి వచ్చిన కావ్య సౌందర్యాన్ని నేటికీ మరెక్కడా దర్శించలేం. ఈ గీతంలో గురజాడ తన పాండిత్యాన్ని ప్రదర్శించలేదు. సూక్తులు వల్లించడం, ఉపదేశాలివ్వడం, హెచ్చరికలు చేయడం లాంటి చేష్టలేవీ కనబడవు. ప్రశాంతంగా, మానవతావాద ప్రభలు గలిగిన ముత్యాలవంటి చినచిన్న ప్రజల మాటలతో, దండలు కూర్చి సత్యాన్ని అలంకరించాడు గురజాడ.

ప్రపంచంలో కార్మికవర్గ రాజ్యాధికార సాధన కోసం కారల్ మార్క్స్ ప్రకటించిన "కమ్యూనిస్టు మానిఫెస్టో"ను ప్రపంచ ప్రజల రాజకీయ కావ్యమని చెప్పవచ్చును. సోషలిస్టు రాజ్యంలోని ప్రజలు కూడా పాడుకొని అభిమానాలను మొలకెత్తించుకునేందుకు సహాయపడే గీతంగా, రాజ్యాభివృద్ధికి ప్రణాళికగా గురజాడ "దేశభక్తి" గీతాన్ని చెప్పుకోవచ్చును.

ప్రపంచంలో మరెవ్వరికీ సాధ్యంకాని దేశభక్తి గీత రచనా కార్యాన్ని సాధించిన మహాకవి గురజాడ చిరస్మరణీయుడు.

---

## స్వీ కా ర ం

★ స్త్రీవాద కవిత్వం- ఒక పరిశీలన (ప్రసంగ వ్యాసం) అద్దేపల్లి రామ్మోహనరావు, పేజీలు 20, వెల రు. 2/- లు, ప్రచురణ : ప్రజా రచయితల సమాఖ్య, (ఆం. ప్ర.), ప్రతులకు : సాంస్కృతిక ప్రగతి, సి-85, వనస్థలిపురం, హైదరాబాదు - 5 0 0681.

★ సీమ కథలు- (రాయలసీమ రచయితల కథల సంకలనం) సంకలన కర్త : సింగమనేని నారాయణ, పేజీలు 246, వెల రు. 40/- లు. ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞానభవన్, 4-1-435, బ్యాంక్‌స్ట్రీట్, హైదరాబాద్ - 500 001.

★ మళ్ళీ కన్యాశుల్కం గురించి- కేతవరపు రామకోటి శాస్త్రి, పేజీలు 120, వెల రు. 20/- లు. ప్రచురణ : చరిత ప్రచురణలు, 5-8-300, చిరాగ్ అలీలేన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.

★ స్త్రీ జన్మసాక్షిగా- కవితా సంపుటి రచన : 'కాట్రగడ్డ' 32 పేజీలు, ధర : రెండు రూపాయలు, కవితాజ్వాల పబ్లికేషన్స్, ఏలూరు - 534 003.

★ ఈ పోరాటం ఆగదు- దళిత పోరాట కథలు, రచన : పి. నాసరయ్య ఉదయరాగం ప్రచురణలు, 94 పేజీలు, వెల : 8 రూ॥లు, కాపీలకు పి. నాసరయ్య, రిటైర్డ్ టీచర్, నిజాంపట్నం-522 314. మైత్రి బుక్‌హౌస్, మసీదు వీధి, కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ-2.




# గురజాడ రచనల్లో మానవతావాదం

—రవిబాబు

డాక్టరేట్ పట్టాకోసం బి. భారతిగారు, చల్లా రాధాకృష్ణమూర్తిగారి పర్యవేక్షణలో సమర్పించిన సిద్ధాంత వ్యాసం ఇది. భారతిగారు ఆంగ్ల, ఆంధ్ర సాహిత్యాలలో ఎం.ఏ. పట్టాలు పొందినవారు కావడంతో ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్య నేపథ్యాలను వివరిస్తూ తమ సిద్ధాంత వ్యాసాన్ని పరిపుష్టం చేశారు.

క్రీస్తుపూర్వం 485-415 సంవత్సరాల మధ్య జీవించిన ప్రొటాగరస్ అనే తత్త్వవేత్త ప్రచారం చేసిన 'మనిషే అన్నింటికీ ప్రమాణం' అనే సిద్ధాంతం మానవతా వాదానికి మూలతత్వంగా వుంది. మానవతావాద చరిత్ర అనే మొదటి అధ్యాయంలో భారతిగారు సోక్రటీసు, సోఫొక్లిజ్, ఎస్కిలస్, సిసిరో, సెనెకా, మార్కస్ మొదలగు గ్రీకు, రోమన్ మేధావులు మానవతావాదులుగా చేసిన కృషిని ప్రస్తావించారు. ఆ తర్వాత వోల్టేరు, రూసో, కాంట్, అగస్ట్, కోంట్, సార్త్రి, విలియం జేమ్స్ తదితరుల భావాలను పరిచయం చేసారు.

తెలుగు సాహిత్యంలో నన్నయ్య నుండి గురజాడ వరకు వున్న రచయితల్లోని మానవతావాద దృక్పథాన్ని రెండవ అధ్యాయంలో పరిశీలించారు. బసవన, పాల్కురికి సోమనాధుడు, అన్నమయ్య, గోపన్న, త్యాగయ్య రచనల్లోగల కుల నిరసన, దురాచారాల ఖండన, భక్త కవుల రచనల్లోని మానవతావాద దృక్పథాన్నీ వివరించారు. తత్త్వ కవులైన వీరబ్రహ్మం, ఏగంటి లక్ష్మయ్య, దూదేకుల సిద్ధయ్య, ఈశ్వరమ్మ, కుమ్మరి సిద్ధప్ప, ప్రకాశదాసు, ఖాజా అహమదుద్దీన్, జనాబ్ సయ్యద్ ఆలీ మొదలైన వారిలో సర్వమానవ సమానత్వ ప్రతిపాదన వుంది.

వేమనలో ప్రగతిశీల అంశాలను అభినందించాల్సిందే. అయితే భారతిగారు రాసినట్లు 'స్త్రీలకో న్యాయాన్ని, పురుషులకో న్యాయాన్ని చూపే సామాజిక ప్రభావం నుండి వేమన బయటపడలేదు....స్త్రీలపట్ల ఆయన ధోరణి అభ్యుదయకరం కాదని నిష్కర్షగా చెప్పుకోవాలి. అది వేమన దృక్పథంలో పరిమితిగా అంగీకరించాలి" అన్న భారతిగారి అభిప్రాయంతో ఏకీభవించి తీరాలి.

సామినేని ముద్దు నరసింహనాయుడు, కందుకూరి వీరేశలింగం, గిడుగు మొదలైనవారు చేసిన కృషిలోగల మానవతావాద దృక్పథాన్ని అభినందించాల్సి వుంది. 125 సంవత్సరాల క్రితమే సామినేని 'హితసూచిని'లో కులరాహిత్యాన్ని, కులరహిత సమాజంకోసం 'వర్ణాంతర వివాహాలు', అనులోమ వివాహాలు జరిగేట్టు చూడవలెనని రాశారు. 'పురుషునితో సమానంగా స్త్రీకి ఉద్యోగవకాశాలు కలిగించాలనీ, అప్పుడే బానిసత్వం నుంచి స్త్రీ విముక్తురాలు కాగలద'నీ అభిప్రాయపడ్డారు. వాడుకభాషలోనే రచనలు చేయాలన్నారు. మొట్టమొదటి వ్యవహారిక భాషావాది సామినేని.

గురజాడకి ముందు మానవతావాద దృక్పథంతో రచనలు చేసినవారిని స్థూలంగా పరిచయం చేసి, మిగిలిన పరిశోధనా వ్యాసమంతా భారతిగారు గురజాడను వారి రచనలనూ వివరంగా విశ్లేషించారు. 'ఏ బోధనలైనా మతంగా మారితే అందులో సంకుచితత్వం చోటు చేసుకుంటుం'దనీ, 'మౌఢ్యానికి దారితీస్తుం'దని గురజాడ నమ్మాడు. 'మత విశ్వాసాలనేవి ఆచరణకు అసాధ్యమైనవి. నిరోధకమైనవి. గుదిబండలవంటివి'. నూరేళ్ళ క్రితమే గురజాడ ఈ విషయమై ఒక నిర్ధారణకు రావడం గమనించదగ్గ విషయం. అంతేగాక గురజాడ 'స్త్రీకి ఇంటి చాకిరీనుండి విముక్తి కలగాలనీ, స్త్రీ ఆత్మరక్షణకు ఖడ్గవిద్య నేర్వాలనీ' ఒకచోట అన్నారు.

గురజాడ రచనలను ఒక్కొక్కటి సమీక్షిస్తూ భారతిగారు, దేశభక్తి గేయం గురించి ప్రస్తావించి, చేసిన ఇతర భాషల్లోని దేశభక్తి గేయాల పరిశీలన ప్రశంసనీయంగా వుంది.

'దించులంగరు' గేయాన్ని సమీక్షిస్తూ, ఆ గేయంలో గురజాడ 'ఆంగిలేయుల ధర్మ రాజ్యము' అని ఇంగ్లీషువారిని పొగడటంలో తప్పుచేశారని భారతిగారు సరిగ్గా విశ్లేషించారు. 'సంఘానికి మార్గదర్శకులు కావలసిన కవులు, మేధావులు భ్రమలకు లోనుకావడం శోచనీయం. దేశాన్ని దోచుకుంటున్న పరప్రభుత్వాన్ని కీర్తించే రచనలు ప్రజలను తప్పుదోవ పట్టించే అవకాశం వుంది. ప్రజలను రాజకీయంగా చైతన్యవంతులను చేయడానికి బదులు ఇటువంటి భావాలు ప్రజలలో స్తబ్ధత, బానిస మనస్తత్వం పెరగడానికి దోహదం చేస్తాయి'. అని నిష్కర్షగా చెప్పడం అభినందనీయం. ఇందిరాగాంధీ అత్యవసర పరిస్థితి ప్రకటించి, 20 సూత్రాలను అమలుచేస్తానని చెబితే విరసం అధ్యక్షుడు శ్రీశ్రీ దాన్ని సమర్థించాడు. ఆ తర్వాత శ్రీశ్రీని వివరణ అడిగితే 20 సూత్రాల పథకం పట్ల భ్రమపడ్డాను అని చెప్పారు. మేధావులే భ్రమపడితే సామాన్య జనం సంగతేమిటి మరి?

ఈ మధ్య కొందరు గురజాడ, వీరేశలింగం మొదలైన సంఘసంస్కర్తల కృషిని తక్కువచేసి, ఆ సంస్కర్తలు సమాజంలో అతి తక్కువగా ఉన్న బ్రాహ్మణులలోని దురాచారాల నిర్మూలనకు మాత్రమే కృషి చేశారనీ వారి గురించి అంతా గొప్పగా ప్రచారం చేయనవసరంలేదనీ, వారి కృషి ఏమంత గొప్ప కృషి

కోదనీ వాదించడం ప్రారంభించారు. అయితే బ్రాహ్మణత్వ ప్రభావం ఇతర సమాజం పై ఎంతగావుందో, బ్రాహ్మణులు ప్రచారం చేసే భావజాలాన్ని సమాజం ఎలా ఆదరించిందో ఈ విమర్శకులు మరచిపోయారు. ఈ దురాచారాలు ఇతర కులాల్లోకి ప్రాకకుండా చేయాలంటే, బ్రాహ్మణ కులంలో ప్రారంభమైన వీటికి వ్యతిరేకంగా పోరాడాలి. అప్పటికి అదే గొప్ప విప్లవం. 1992 పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని, నూరేళ్ళక్రితం వారు ఇలా చేయలేదు, అలా చేయలేదు అనడం తేలికే. ఈ విషయ ముపై భారతిగారు వ్యాఖ్యానిస్తూ "గురజాడ కాలంనాటి రాజకీయ, సాంఘిక పరిస్థి తులు ప్రజలస్థాయి, వ్యవస్థలో మార్పు తెచ్చేందుకు అనువుగా లేవు. ఆ ప్రయత్నా నికి అవసరమైన కనీస అవగాహన, చైతన్యం నాటి సంఘంలో కొరవడ్డాయి" అన్నారు. నిజమే. వ్యవస్థని మార్చాలంటే, ప్రజల మెదళ్ళలో భావవిప్లవం కలగాలి. దానికి దోహదం చేసే రచనలే వీరివి.

ఇటీవల ఇంద్రగంటి శ్రీకాంతశర్మ ఒక పాతవాదనను సరికొత్తగా ప్రవేశ పెట్టారు. అదేమిటంటే 'గురజాడ తర్వాత వచ్చిన భావకవులకు అడుగుజాడ గురజా డది కాదు' అని. నిజమే. అంతమాత్రాన గురజాడ యుగకవి కాకుండా పోడే. 'గురజాడ మానవ అనుభూతులను విశ్లేషిస్తూ, సమస్యలను ఎత్తిచూపుతూ, పరి ష్కార మార్గాలు సూచిస్తూ మానవ క్షేమకాంక్షతో రచనా వ్యాసంగం చేస్తే, ఆ రచ నలతో ప్రభావితం కాక... భావకవులు కాల్పనిక వాదంతో ప్రభావితమయ్యారన్న వాస్తవం గురజాడ ముందుచూపును తెలియచేస్తోంది. ఆయన ఒక ద్రష్ట అని రుజువు చేస్తోంది. అంతేకానీ ఆయన కృషిని ఎంతమాత్రం కించపరచవు. జూలై 69 'సంవేదన'లో రారా రాసిన వ్యాసం ముగింపులో ఈ విషయాన్నే స్పష్టం చేశారు. ఒక మిత్రునితో చర్చ సందర్భంగా ఆయన ఇలా అన్నారట. "రవీంద్రుని భావాలు 19వ శతాబ్దివి. గురజాడవి 20వ శతాబ్దివి. కానీ ఈనాడు మళ్ళీ ఆలోచిస్తే సందేహం కలుగుతున్నది. 1969లో తెలుగుదేశాన్నీ, తెలుగు సాహిత్యాన్నీ, తెలుగు మనిషి సగటు సంస్కారస్థాయినీ కలయజూస్తే, గురజార భావాలలో అధికభాగం యిరవ య్యొకటో శతాబ్దివేమో అనిపిస్తున్నది" వింత వాస్తవం ఇది! గురజాడ తన కలం కన్నా చాల ముందుగా పయనించాడు.

గురజాడ గురించి ఎంతో విమర్శనా సాహిత్యం వచ్చింది. అదంతా ప్రస్తుతం అందుబాటులో లేదు. "కన్యాశుల్కం" ప్రదర్శన శతవార్షికోత్సవ సందర్భంగా గురజాడ కృషి గురించి తెలుసుకోదలచిన వారందరూ ఈ పుస్తంకొని చదవాల్సిన అవసరం వుంది.

---

## గురజాడ రచనలు - మానతావాదం

**రచన : డాక్టర్. బి. భారతి**

పేజీలు 190, ధర 25/- దొరుకుచోటు, విశాలాంధ్రవారి అన్ని బ్రాంచీలలోను

# పిల్లల ప్రపంచం




## కవిత్వం రాయటం ఎలా?

పెద్దవారే కాదు, పిల్లలూ కవితలు రాస్తారు. రాయాలి. కవిత్వం రాయటం, కథలు రాయటం, చదవటం, చెప్పటం మంచి అలవాట్లు. అలాగే బొమ్మలు వేయటం కూడా. ఇంకా పాటలు పాడటం, సంగీతం నేర్చుకోవడం లాంటివి పిల్లలందరూ సాధించాల్సిన మంచి విషయాలు.

కవిత్వం రాయటం కష్టం కాదు. ముందు మీరు కాయితం, కలమ్ తీసుకొని ఓ చోట కూర్చోండి. ఏం రాయాలా అనే సందేహం వస్తుంది. మీరు అటూ ఇటూ చూస్తారు. మీకు ఏం కనిపిస్తున్నాయి? పిచ్చుకలు అద్దాన్ని తన ముక్కుతో పొడవటమా? మీ చూరులో గూడు కట్టుకున్న పక్షి? అమ్మా? చెల్లా? తమ్ముడా? ఎవరైనా సరే - ఏ వస్తువయినా సరే. ముందు వీటన్నింటిలోనూ మిమ్మల్ని ఎవరు ఎక్కువగా ఆకర్షించారో చూసుకోండి. ఇంక మొదలు పెట్టండి. తిరిగి ఏం రాయాలని సందేహం కదూ? అమ్మను ఏమైనా అడగాలనుకుంటున్నారా? అమ్మ గురించి ఏమైనా చెప్పాలనుకుంటున్నారా? మీ చెల్లి అల్లరా? నీటిలో మీరు చూసుకున్న మీ రూపమా? ఏదైనా సరే మీలోపలి నుండి వచ్చింది. మీరు రాయాలనుకుంటున్నది రాయండి. అదే కవిత. కవిత్వం అంటే పిల్లలు కాదు. పిల్లలకు అర్థంకానిది కూడా కాదు. శ్రీశ్రీ తాతగారు ఏమన్నారో తెలుసా? కుక్కపిల్ల మీదా, అగ్గిపుల్ల మీదా, తలుపు గొళ్ళెం మీద కూడా కవిత్వం చెప్పవచ్చు అని. ఓసారి ఓ పిల్లవాడు అయన్ని ఇది కవిత్వమా? ఇలా అయితే నేనూ రాస్తా అన్నాడట. నిజంగానే ఈనాటి పిల్లలు ఎంత మంచి కవిత్వం రాస్తున్నారో!

అందుకే మన 'పిల్లల ప్రపంచం' కోసం మీరు మంచి కవితలు రాసిపంపించండి. ఉంటాను మరి. —మీ అంకుల్.

నిర్వహణ : పి. చంద్రశేఖర్ అజాద్ APSTC Ltd., డి. సి. ఎమ్. ఎన్. బిల్డింగ్స్, ఎన్. ఆర్. పేట, ఏలూరు.

## పిట్ట పాట

నేనో చిన్నారి పక్షిని
గాలిలో హాయిగా ఎగిరే నన్ను
ఈ పంజరంలో బంధించారు
నన్ను కొనుక్కున్న ఆ మనిషికోసం
నేనిక్కడ నిలబడి పాట పాడాలి
ఈ పంజరం గుండ్రంగా ఉంది
నా రెక్కలు ముడుచుకుపోయాయి
ఈ ఇనుప చువ్వలు నన్ను
కదలనివ్వవు.
నేను ఎత్తుల కెగర లేను
అయినా ఈ పంజరం నుండే
నా మనసు పాడుతుంది
ఆ పాటనూ, నా మనసునీ
ఈ పంజరం బంధించలేదు
ఆ మనిషీ కొనలేడు.

(ఓ ఆంగ్ల కవిత ప్రేరణతో)

## 2010 వ సంవత్సరంలో

ఉదయం నేను లేస్తాను. ఎటు చూసినా పచ్చటి చెట్లు కనిపిస్తాయి. నేను నా గది తలుపు తీసి బయటకు వస్తాను. ఒక్కసారిగా గాలి నన్ను తాకుతుంది. ఆ గాలి నిండా ఉదయపు పరిమళం. నా ఎదురుగా ఉన్న ఆ అందమైన దృశ్యాలు చూస్తూ అలా ఉంటాను కొంచెంసేపు. నేను ఇంటి నుండి బయలుదేరుతుంటాను. నా కళ్ళముందు అందరూ పిల్లలే. వారందరూ బడిలోకే పరుగులు తీస్తుంటారు. ఒక్కరు ఒక్కరంటే ఒక్కరు కూడా ఇప్పటి చాలామందిలా పని చేయటానికి వెళ్ళరు. వెళ్ళకూడదు. అదే నేను ఊహిస్తున్న అద్భుత దృశ్యం.

[పిల్లలూ ఇదో అభిప్రాయం. మీరు కూడా ఇలా మీ మీ ఊహల గురించి క్లుప్తంగానూ, స్వేచ్ఛగానూ రాసి పంపండి. చాలా కాలంపాటు ఈ శీర్షిక కొనసాగుతుంది.]

## కొన్ని జోకులు

1. ఓ షూటింగ్ జరుగుతోంది. చాలా ఆవేశంగా మాట్లాడుతున్న ఓ మంత్రి "ఈ దేశం ఏమైపోతుందోనని బాధగా ఉంది" అన్నాడు.

"నీకెందుకు బాబూ ఆ బాధ, అదేదో మాకుండాలి గాని" అనుకున్నారు వింటున్నవారు.

2. "అడుక్కుతినటాన్ని ప్రభుత్వం నిషేధిస్తుందంట" అన్నాడో వ్యక్తి.

"అదేదో వాళ్ళ జన్మహక్కు కాబోలు" అన్నాడు భిక్షగాడు.

## కవిత

నా మనసు చిన్నదే
దాని స్వేచ్ఛ మాత్రం
ఆకాశమంతది !




★ సంస్కృతి గురించిన వ్యాసం చాలా బాగుంది. యిటువంటివి ప్రజాసాహితిలో తప్పనిసరి చేయండి.

—నటరాజ్, విశాఖపట్నం.

★ 'భద్రం కొడుకో' సినిమా సమీక్ష బాగుంది. ఇలాంటి సినిమాల మీద ఇలాంటి సద్విమర్శలు వస్తే తెలుగు సినిమాకి వెలుగు దారిని వేసే దర్శకులు పుట్టుకొచ్చేందుకు వాతావరణం ఏర్పడుతుంది. —కాకరాల, మదరాసు

★ ఆగస్టు 92 'ప్రజాసాహితి'లో కన్యాశుల్కం గురించి సమగ్ర సమాచారం అందించడంలో కృతకృత్యులయ్యారు గాని- చాలాచోట్ల చర్వితచర్వణం అయింది. 'కన్యాశుల్కం' సినిమా తీసింది వేదాంతం రాఘవయ్య కాదు- పి. పుల్లయ్య. 'చిత్ర'గారి కథ 'దేశమంటే మనుషులోయ్' సందర్భానుసారంగా ఉండడమేగాక, వాడినీ, వేడినీ కలిగి వుంది.

—మరో ఛార్లెస్, విజయవాడ

★ 'కన్యాశుల్కం' ప్రదర్శన శతజయంతి సంచిక ఎంతో ప్రశంసనీయంగా వుంది అన్ని కోణాల్లోనూ కన్యాశుల్కం విశిష్టతను విశదపర్చే వ్యాసాలూ, jottings ఎంతో ఉపయోగకరంగా వున్నాయి. కాకరాల వ్యాసం సంచికకే హైలైట్. దీనిని పదికాలాల పాటు చూసుకోదగినంత గట్టిగా, రిఫరెన్సు గ్రంథంగా రూపొందించడంలో కృషిచేసిన వారందరూ అభినందనీయులు.

— యన్. గోపి, హైదరాబాద్

★ 'కన్యాశుల్కం-ప్రజాసాహితి' సంచిక, పరిశోధనాత్మక, విశ్లేషణాత్మక, చారిత్రాత్మక సమాలోచనలతో కూడి వుంది.

— వావిలాల గోపాలకృష్ణయ్య, గుంటూరు

★ ఈ సంచిక 'కన్యాశుల్కం' మీద ముందు తరాలకు ఒక చక్కని మార్గదర్శకంగా అనిపిస్తుంది. — ఎ. బి. సుందరరావు, విశాఖ

---

## సవరణ

జూలై 92 సంచిక "ప్రజాసాహితి"లో ప్రతిన్, కా॥ నూతన్‌పై వ్రాసిన కవితలో 'జంగ్' (యుద్ధం)కి బదులుగా 'జంక్షన్' అని పడింది. సవరించుకోమని కోరుతున్నాం. —సంపాదకుడు




# మనల్ని చుట్టుముడుతున్న బూతు

ఉన్నత మానవతా విలువలు అధఃపతనమై పోతున్న దుస్థితి మనందరికీ రోజువారీ జీవితంలో అనుభవమౌతోంది. దేశభక్తీ, సామ్రాజ్యవాద వ్యతిరేకతా, ప్రజాతంత్ర చైతన్యమూ, సేవా తత్పరతా, సహాయపడే తత్వమూ.... ఇటువంటి వన్నీ మృగ్యమైపోయి, స్వార్థబుద్ధీ, ఇతరులు ఎంత అపాయస్థితిలో వున్నా పట్టించుకోకపోవడమూ, ఏదో ఒక పద్ధతిలో ధనార్జన చేయాలనే భావనా, భూస్వామ్య, సామ్రాజ్యవాద సంస్కృతి ప్రభావంలో పడిపోవడమూ ఈనాడు సమాజంలో మనం కళ్ళారా చూస్తున్నాం.

ప్రత్యేకంగా సామ్రాజ్యవాద సంస్కృతి ఒక ఉప్పెనలా మనపై విరుచుకు పడ్తోంది. ప్రచార, ప్రసార సాధనాలన్నిటి ద్వారా మానవునిలోని అధమ ప్రవృత్తులను రెచ్చగొట్టే బూతు ప్రచారం చేయబడ్తోంది. విజ్ఞాన శాస్త్రం ప్రసాదించిన ఆడియో, వీడియో కాసెట్లను విజ్ఞానం, విచక్షణా జ్ఞానం పెంపొందించుకోడానికి కాకుండా అశ్లీలాన్నీ, లైంగిక వికారాలనూ ప్రచారం చేయడానికి ఉపయోగించుకోవడం శాస్త్ర విజ్ఞానానికే అవమానకరమైన విషయం.

ఇటీవల ఆర్. కె. రికార్డింగ్ కంపెనీ "మాల్గుడి శుభ" అనే గాయని చేత పాడించిన పాటలను 'చిక్‌పక్ చిక్‌బం' అనే పేరుతో ఒక ఆడియో కేసెట్ విడుదల చేశారు. ఈ పాటలను రాసిన 'సాహితి' అనే రచయిత ఫోటో కూడా దీనికి సంబంధించిన ఇన్‌సే కార్డులో ముద్రించి, శ్రోతలకు అతనిని చూసే 'భాగ్యం' కల్గించారు. ఇవన్నీ బూతు పాటలే. స్త్రీని ఎంత చులకనగా చూపాలో, ఎంత అవమానించాలో అంత అవమానించిన పాటలు ఇవి. విశృంఖలంగా, విచ్చలవిడిగా స్త్రీ తిరుగుతూ వుంటుందని వీరి భావన! ఇంత సిగ్గులేనితనంగా పాటలను రాసి. పాడించి, సంగీతం అంపెంచి, రికార్డు చేసి ప్రజలపై వదలడానికి—దీనికి సంబంధించిన వారు ఎంతగా పతనమై పోయారో తెలియచేస్తోంది. →

# చైతన్య వాహిని

జూన్ 2 న గుంటూరు జిల్లా రాజోలులో కా॥ దొంతు నాగయ్యగారి వర్థంతి సభ సందర్భంగా కృష్ణా జిల్లా జనసా ి క ులు "అ ్పుల భారతం" ్ర దర్శన ఇచా ారు.

జూన్ 9 న కృష్ణా జిల్లా దివి తాలూకాలో సాలెంపాలెం గ్రామంలో బంజరు భూముల సమస్యపై జరిగిన బహిరంగ సభలో జనసాహితి కళాకారులు "అప్పుల భారతం" ప్రదర్శించారు.

సముద్రతీర బంజరు భూములు స్థానికులైన పేద, మధ్యతరగతి ప్రజలకు కాక సంపన్న వర్గాలకు, విదేశీ సంస్థలతో మిలాఖత్ అయిన గుత్త పెట్టుబడి దారీ సంస్థలకు కట్టబెట్టి తద్వారా సముద్రతీర భూములను, సముద్ర సంప దల్ని విదేశీయులకు తరలించే ప్రభుత్వ కుట్రను బట్టబయలు చేస్తూ "దండోరా" అనే మరో వీధి నాటికను జనసాహితి రూపొందించింది. తీర ప్రాంత ప్రజల సమస్యలపై బందరులో జరిగే రాష్ట్ర సదస్సుకి ప్రచారంలో పాల్గొన్న జనసాహితి కళాకారులు యీ వీధి నాటకాన్ని జూన్ 14 న గిలకల దిండి గ్రామంలో, 15 న బంటుమిల్లి గ్రామంలో, కృత్తివెన్నులో 16వ →

ఇది ఇలా వుంటే, ఒక వారపత్రిక వారు ఇటీవల ఈ గాయనిచేత ఇటు ు పాటల కచేరీ ఏర్పాటు చేశారు! ఇంతేగాక, ఇటువంటి కేసెట్స్ మనకు ్సల్లో, టాక్సీల్లో, స్వంత కారుల్లో, ట్రాక్టర్లపై, టీ దుకాణాల్లో - సర్వత్రా విన ుతూ మన చెవుల్లో బూతును నింపుతుంటాయి.

పైపెచ్చు ఇటీవల సామ్రాజ్యవాద దేశాల్లో వున్న ఒక 'సౌకర్యం' ఇటీవల ; దేశం 'బూతుప్రియుల'కు కల్పించబడింది. అదేమిటంటే నెలకు కొన్ని వేల పాయలు అద్దె కడితే, హాంగ్‌కాంగ్ నుంచి టెలిఫోన్‌లో మనకు అందమైన ు బూతు సంభాషణలు వినిపిస్తూ వుంటారట!

ఇలా మన దేశంలో బూతు అభివృద్ధి మూడు పూవులూ ఆరు కాయలుగా ాగుతుంటే, దీనిని ప్రతిఘటించడానికి ఒక పోరాటం ఈనాడు అత్యావసరం. మేధా వులూ, ప్రజాతంత్ర వాదులూ, ప్రజలూ ఈ బూతు సంస్కృతిని త్రిప్పికొట్టే పోరా టంలో పాల్గొని, సామ్రాజ్యవాదుల కుట్రలను భగ్నం చేయాలి. ప్రతి వూరిలోనూ ఏదో ఒక స్థాయిలో నిరసన, ప్రతిఘటన ఉద్యమం సాగకపోతే, మనం పూర్తి బానిసలుగా పతనమవ్వడం తథ్యం.

నెల్లూరు. —డా. సుధీర్

తేదీన, ఆదేరోజు పల్లెపాలెంలోనూ ప్రదర్శించారు. ఈ ప్రదర్శనలతోబాటు "అప్పుల భారతం" వీధి భాగవత నాటకం కూడా ప్రదర్శించారు.

జూన్ 18 న బందరులో తీరప్రాంత జిల్లాల ప్రజల సమస్యలపై రాష్ట్ర సదస్సులో అరుణోదయ రామారావు, ఉదయ్‌ల నిర్వహణలో సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు. సదస్సు ప్రాంగణానికి పెట్టిన కా॥ చల్లపల్లి [illegible] ప్రసాదకు అనుగుణంగా అమరవీరుడైన ప్రకాశ్, దివి, ఉదయ్‌ల బృందం 'నెత్తుటి దీపాలు' కళారూపం ప్రదర్శించారు. సాయంత్రం ఊరేగింపు ముందు సాంస్కృతిక దళం కళారూపాలతోనూ, డప్పు-నృత్యాల తోనూ పాల్గొన్నారు. బస్ స్టాండ్ సెంటర్‌లో జరిగిన బహిరంగ సభలో విప్లవ గేయాలు, 'దండోరా' (తీరప్రాంత బంజరు భూముల వీధి నాటకం), "అప్పుల భారతం" ప్రదర్శన ఇచ్చారు. సాంస్కృతిక కార్యక్రమాలను వేలాది ప్రేక్షకులు ఆసాంతం ఉత్సాహంగా తిలకించారు.

జూన్ 29 న విద్యార్థి సంఘాల విలీనం సదస్సు (గుంటూరులో) సందర్భంగా జరిగిన ఊరేగింపు ముందు జనసాహితి కళాకారులు తమ కళారూపాలతో పాల్గొన్నారు. గాంధీ పార్కులో జరిగిన బహిరంగ సభలో కృష్ణా జిల్లా డప్పు కళాకారులు - డప్పు నృత్యం, 'అప్పుల భారతం' - వీధి భాగవతం ప్రదర్శించారు. ఈ సందర్భంగా రూపొందించిన "పిడియస్యూలో చేరండి-పీడనను వ్యతిరేకించండి" కథా గేయ నృత్యం విద్యార్థులను బాగా ఆకర్షించింది.

జూలై 1 న రాజమండ్రి ఆనం కళాకేంద్రంలో 3 వేలమంది ప్రేక్షకుల ముందు, జులై 3 న నెలిపూడిలోను, జులై 4 న జక్కంపేటలోను, వేట్లపాలెంలో ప్రచారం, జులై 5 న కాట్రావులపల్లెలో బహిరంగ సభలో అరుణోదయ కళాకారులు "అప్పుల భారతం" ప్రదర్శించారు.

జులై 20 న పెద్దాపురంలో ఆం.ప్ర. రైతుకూలీ సంఘం తూ॥గో॥ జిల్లా మహాసభలో అరుణోదయ వారు "అప్పుల భారతం" విజయవంతంగా ప్రదర్శించారు.

జులై 28 న అనంతపురం జిల్లా తరిమెల గ్రామంలో జరిగిన కా॥ తరిమెల నాగిరెడ్డి వర్ధంతి సభలో కృష్ణా జిల్లా అరుణోదయ "అప్పుల భారతం" వీధి భాగవత యక్షగానాన్ని, కర్నూలు జిల్లా అరుణోదయ "భూమి భాగోతం" కళారూపాల్ని ప్రదర్శించారు.

జులై 31, ఆగస్టు 1, 2 తారీఖులలో నల్గొండ జిల్లా అరుణోదయ నిర్వహణలో అరుణోదయ ముఖ్య కళాకారుల శిక్షణా శిబిరం నిర్వహించింది.

ఈ సందర్భంగా 1 వ తేదీన ఇస్తాపురంలోను, 2 వ తేదీన ముక్కిడిదేవ పల్లెలో బహిరంగ సభలు, సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి.

అగస్టు 16 నుంచి 20వ తేదీ వరకు హైదరాబాద్ అరుణోదయ శాఖ కళాకారుల వీధి నాటకం శిక్షణా శిబిరంలో అరుణోదయ రాష్ట్ర కార్యదర్శి ఉదయ్ శిక్షకులుగా పాల్గొన్నారు. విద్య ప్రయివేటీకరణపై విద్యార్థులు సాగిస్తున్న సమైక్య ఆందోళనకు మద్దతుగా అరుణోదయ మరో వీధి నాటకాన్ని ఆ శిబిరంలో తయారుచేసింది. "సంతలో చదువులు" అనే వీధి నాటకాన్ని రూపొందించుకుని హైదరాబాద్ శాఖ అరుణోదయ కళాకారులు 18 వ తేదీన R. T. C. క్రాస్ రోడ్స్ వద్ద, ఆర్టీసి వర్క్‌షాపు వద్ద, చార్మినార్ ఫ్యాక్టరీ వద్ద ప్రదర్శించారు. 19 వ తేదీన సా॥ 6 గం॥లకు సెక్రటేరియట్ వద్ద వీధి నాటకాన్ని ప్రదర్శిస్తున్న కళాకారులను ప్రదర్శనను మధ్యలో ఆపివేసి అరెస్టు చేశారు. ఉదయ్, చైతన్య, విద్య, అంబిక తదితరులను అరెస్టు చేసి, తర్వాత విడుదల చేశారు. 20వ తేదీన జరిగిన విద్యార్థి మహా ప్రదర్శనలో ఇందిరా పార్క్‌లో 2 సార్లు, బహిరంగ సభానంతరం ఒకసారి ప్రదర్శించారు.

సారా వ్యతిరేక పోరాటం రోజురోజుకూ తీవ్రతరం అవ్వటమే కాక తెలంగాణా వరకే ఉన్న ఉద్యమం రాష్ట్రంలోని మిగతా అన్ని జిల్లాలకు వ్యాపిస్తున్న నేపథ్యంలో అరుణోదయ రాష్ట్ర అధ్యక్షుడు దివికుమార్, రాష్ట్ర కార్యదర్శి ఉదయ్‌లు "శబ్దం" అనే వీధి నాటకాన్ని రూపొందించారు. దీనిని అన్ని శాఖలు ప్రదర్శించడానికి సంసిద్ధం కావాలని పిలుపు నిచ్చారు.

### 'కన్యాశుల్కం ప్రదర్శన శతజయంతి' ప్రత్యేక సంచిక ఆవిష్కరణ సభలు :

### హైదరాబాద్‌లో 30-9-92 తేదీ :-

జనసాహితి - విప్లవ రచయితల సంఘం సంయుక్తంగా సుందరయ్య భవన్‌లో ఏర్పాటు చేసిన "వందేళ్ళ కన్యాశుల్కం-సమకాలీన సమాజం-విశ్లేషణ" సెమినార్‌లో ప్రజాసాహితి 'కన్యాశుల్కం ప్రదర్శన శతజయంతి' ప్రత్యేక సంచికను విరసం కార్యవర్గ సభ్యుడు పి. వరవరరావు ఆవిష్కరించారు. ఆ సందర్భంగా మాట్లాడుతూ "గిరీశం పాత్ర ఈనాటి దేశవాళీ దళారీవర్గానికి ప్రతిబింబం. సామ్రాజ్యవాదానికి దళారీగా పనిచేస్తున్న ప్రధానమంత్రిని ఆధునిక గిరీశంగా పేర్కొనవచ్చును. కేవలం సృజనాత్మకత వల్ల మాత్రమే రచన కలకాలం నిలుస్తుంది" అన్నారు. ప్రొఫెసర్ వి. రామకృష్ణ మాట్లాడుతూ "కన్యాశుల్కం నాటకాన్నీ, గురజాడనూ అర్థం చేసుకోడానికి 19 వ శతాబ్దం చివరి భాగంలో దేశంలో

నెలకొని వున్న సాంఘిక, ఆర్థిక, రాజకీయ సంధికాలాన్ని పరిగణనలోకి తీసుకోవాలి. ఆనాడున్న అర్ధవలస, అర్ధభూస్వామ్య లక్షణాలు నేటికీ కొనసాగడం, సంధికాల వైరుధ్యాలు కొత్తరూపంలో నిలవడం కన్యాశుల్క సమకాలీనతకు చిహ్నం. గురజాడను ఆనాటి నుండి నేటివరకు ఉన్నత వర్గాలు, పాలక వ్యవస్థ మనస్ఫూర్తిగా ఎన్నడూ ఆమోదించలేదు. గురజాడ మీద స్టాంపు కావాలంటూ ప్రభుత్వానికి కొందరు మేధావులు చేసిన విజ్ఞప్తి అర్థం లేనిది"అన్నారు. జనసాహితి ప్రధాన కార్యదర్శి కొత్తపల్లి రవిబాబు మాట్లాడుతూ "నూరేళ్ళ క్రితమే కన్యాశుల్కం నాటకం ద్వారా యుగకర్త గురజాడ వ్యావహారిక- మాండలిక భాషల ఉపయోగం గురించి ఒక మార్గాన్ని చూపించా"రన్నారు. "నిరక్షరాస్యులైన ప్రజల్లో భావచైతన్యం కల్గించడానికి దృశ్యకళల అవశ్యకత గుర్తించి నాటకాన్ని రాశా"రన్నారు. "సాహిత్యానికి సామాజిక ప్రయోజనం వుండాలన్నా"రన్నారు. "కమ్యూనిస్టుపార్టీ గురజాడ రచనలన్నిటినీ బయటికి తీసి వాటిలోని ప్రజాతంత్ర విప్లవ చైతన్యాన్ని గుర్తించి ప్రచారము చేసిం"దన్నారు. ప్రసంగంలో చివర ప్రజాసాహితిలో ప్రచురించిన వసీరా కవిత 'మధురవాణి నవ్వు'ను చదివి వినిపించారు. ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన నారాయణస్వామి మాట్లాడుతూ, "గిరీశం పాత్ర ఇప్పటి జనార్ధనరెడ్డి, జార్జి బుష్‌లకు సరిగ్గా అతికినట్లుగా సరిపోయే పాత్ర" అన్నారు. సభలో కె. రత్నమాలగారు కన్యాశుల్కంలో స్త్రీ పాత్రల గురించి మాట్లాడారు. సభ ప్రారంభంలో అరుణోదయ రామారావు బృందం 'దేశమును ప్రేమించుమన్నా' గేయం పాడారు.

## 31-9-92 తేదీ అనంతపురంలో...

కృష్ణకళామందిరంలో 31-9-92 తేదీ సాయంత్రం 6-30 గం॥లకు జరిగిన సభలో, ప్రముఖ విమర్శకుడు సర్దేశాయి తిరుమలరావుగారు ప్రజాసాహితి ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. ఈ సందర్భంగా ఇంగ్లీషు ప్రొఫెసర్ కె. వెంకటరెడ్డి గారు మాట్లాడుతూ ఆంగ్ల నాటక రచయిత బెర్నార్డ్ షా రాసిన రెండు నాటకాలకూ, కన్యాశుల్కానికీగల సామ్యాలను ఉదహరించారు. రచయిత జైరామ్, జర్నలిస్టు వై. కాశీపతి కూడా మాట్లాడారు. అధ్యక్షత వహించిన జనసాహితి ప్రధాన కార్యదర్శి కొత్తపల్లి రవిబాబు మాట్లాడుతూ, "గురజాడను చరిత్రలో ఒక వ్యక్తిగా భావించి స్మరించడంలేదు. ఆయనా, ఆయన రచనలు సమకాలీనంగా వున్నాయి. ఆయన లేవనెత్తిన సమస్యలను పరిష్కరించే దిశలో తలచుకుంటున్నాం" అన్నారు. అధ్యక్షుడు రవిబాబు సమావేశం మధ్యలో వెళ్ళిపోవడం వల్ల ప్రజాసాహితి వర్కింగ్ ఎడిటర్ నిర్మలానంద అధ్యక్షత వహించి సభని నిర్వహించారు. సమావేశానికి ముందు మధ్యలో అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య గాయనీ గాయకులు జనం పాటలు పాడారు.

మేమె వరమమ్మా!
నీవు చందమామ చూపి,
సూర్యుణ్ణి చూపి, కర్ణకుండలాలు అతికి
ఉక్కుదార్ఢ్యం నింపి పెంచిన ఏపైన మొక్కలం
నీ పెవనివమ్మా!
కాకులు, గద్దలు ఎత్తుకుపోకుండా
పసిగుడ్లను అదిమి అదిమి దాచుకునే తల్లి కోడివి గదా నీవు!
కొంగలు, దొంగలు దోచుకోకుండా
కంచె వేసి, మంచెమీద కళ్ళు నాటి
పాలగింజల రాశలా కాసిన తోటమాలివి గదా నీవు
నీ డొక్కలు ఎండుకుపోతుంటే ఎట్లా చూడమంటావు ?
నీ రెక్కలు విడివడని సంకెళ్ళయితే ఎంతకని ఓర్చమంటావ్ !?
నా మదర్ ఇండియా!
అమ్మకడుపు చల్లగా ఉండాలనే గదమ్మా
కడుపులో చల్ల కదలకుండా బ్రతకడం నేరమన్న
పంచనదుల "పాష్"ను అవతరింప చేసుకొని
భూమి! నా తలపెల నిర్ణయించమన్న సాహస సముద్రున్ని ఆవహించి
మానేరును, ప్రాణహితను పరుగులెత్తే
వేల వేల జలధారల్ని గోదావరిలో ప్రవహింపజేసి
దండకారణ్యం నిండా,
ధరిత్రి దమనుల నిండా, సిరలనిండా
మానవ గానాన్నే "వేణు"వు లూదిన
"నూత్న" పవనాన్ని శ్వాసించి, శ్వాసించి
అమ్మా! అజరామరుణ్ణయినా
నీవు ఎప్పటికీ విధ్వంసాన్ని ద్వేషించాలి
నీవు ఎప్పటికీ మృత్యువును ద్వేషించాలి
చావుకు చివరి చీటి కోసం
నన్ను తరగని ఆయుధాగారం చేసిన
తోబుట్టువుల వారసత్వాన్ని సగర్వంగా కొనసాగిస్తా
అమ్మ కడుపు చల్లగా
నన్ను దీవించమ్మా ——

# అమ్మ కడుపు చల్లగా....

చెరుకు సుధాకర్

హిమాలయాలను పెనవేసుకున్న
ఔన్నత్యం వెన్నుపూసకయి
చిటారు కొమ్మల్ని సైతం నిటారుగా నిలబెట్టిన
అన్నల్ని, అక్కల్ని తోబుట్టువులు చేసిన
అమ్మా!
శరీరం మోసి, కార్చిచ్చుల గర్భస్రావాన్ని అధిగమించి
మోసులెత్తే రేపటి కోసం
నెత్తురు మడుగయిన ప్రసవ వేదనలో
రొప్పుతూ, దొర్లుతూ రాటిన
ఒక్కగానొక్క పసిపసి నవ్వుల చంద్రుణ్ని చూసి
మురిసి ముక్కయిపోయిన
నా చిన్నెల ప్రేమ....అమ్మా!

అమ్మ కడుపు చల్లగా
నీకొక మాట చెబుతా
ఊర్లకు ఊర్లు మట్టి దిబ్బలయినాయని
కెల్లి కెల్లి నవ్వే మానవగుచ్ఛం
తుపాకీ బయోనెట్ మొన తాకిడికి రెల్లి రెల్లి
చెల్లా చెదరయిందని దుఃఖించకు తల్లీ!
నాకు తెలుసు నీవు విధ్వంసాన్ని ద్వేషిస్తావని....
నాకు తెలుసు రాబందుల ఇనుపగోళ్ళ క్రింద
మంట గలుస్తున్న కడుపుపంట రాజ్యహింస విశృంఖలతను
రెట్టించి రెట్టించి ద్వేషిస్తావని....

(మిగతా 3వ కవర్ పేజీలో)